# KALAVATHI

## THE VICTORY OF SIVAJEE

---



BY

MUDUMBI

VENKATA RAGHAVACHARYULU, B.A.

PRICE As. 0-7-

Approved for School use by the M. T. B. C. *Vide* Fort St. George Gazette, Part I-B, Page 268 dated 14th April 1931.

శ్రీరస్తు.

# కళావతి.

శ్రీమన్ముడుంబి - వేంకటరాఘవాచార్యులు బి. ఏ.,
విజయనగరము.

రెండవకూర్పు.

1933

ఆర్. వేంకటేశ్వర అండ్ కంపెనీ వారిచే
ఆనందముద్రాక్షరశాలయందు ముద్రించి ప్రకటితము.

మద్రాసు.



వెల 0-7 6

# అవతారిక.

ఈ గ్రంథమునందలి కథాభాగమునఁ గొంతవఱకు విఖ్యాతాంగ్లగ్రంథకర్త యగు "మెడోస్ టెయిలర్" గారి "తారా" యనునవలనుండి గ్రహించితిని గాన, తద్గ్రంథకర్తకుఁ గృతజ్ఞుఁడను. "తారా" యందలి నాయిక హైందవవితంతువయ్యును మహమ్మదీయవీరుని వివాహమాడెను. ఇది భారతీయాచారవిరుద్ధ మగుటచే నీ "కళావతి" యందు నూతనకథను జేర్చి వలయు మార్పులను గావించితిని. మఱియు శివాజీ, అఫ్జుల్ఖానుల యుద్ధమునుగూర్చి వ్రాయునపు డాంగ్లేయచరిత్రకారులను విడిచి, హైందవచరిత్రకారులనే యనుసరించితిని. ఇందు దోషము లున్నచో, మన్నింపవలయు నని వాచకులను వేఁడుచున్నాను. నా వ్రాఁతపుస్తకమును సావకాశముగఁ జదివి వలయునట్టి సవరణము గావించియు, ముద్రావస్థలోఁ బరిశోధించియు నీ విధముగా నీ పుస్తకమును తయారుచేయించిన బ్రహ్మశ్రీలు, పండిత పురాణం - సూర్యనారాయణతీర్థులవారికి మత్కృతజ్ఞతాసూచకముగా వందనము లర్పించుచున్నాఁడను.

విజయనగరము.<br>20 జూన్ 1930.

ఇట్లు,<br>ముదుంబి-వేంకటరాఘవాచార్యులు.

# అంకితము.

---

చిన్ననాఁటనుండియు నన్నల్లారు ముద్దుగాఁ బెంచి, పెద్దవానినిజేసి విద్యాబుద్ధులఁ గఱపిన, సాధ్వీమణియగు మత్ప్రియమాత శ్రీమతి ముడుంబి మంగతాయమ్మగారికి గ్రంథమును భక్తిపూర్వకముగా నంకితముఁ జేసితిని.

ముడుంబి - వేంకటరాఘవాచార్యుఁడు.

# విషయసూచిక.

## ప్రథమ ఖండము.



## ద్వితీయ ఖండము.

## తృ తీ య ఖ ం డ ము.

# ఇందువచ్చు పాత్రలు.

పురుషులు.

వ్యాసశాస్త్రి—తులజాపుర ధర్మకర్త.

మోరోపండితుఁడు—శివాజీ యనుచరుఁడు.

రంగనాథుఁడు—పండరపుర ధర్మకర్త.

వీరభద్రుఁడు—రంగనాథుని సోదరుఁడు.

శ్యామసుందరుఁడు—రంగనాథుని కుమారుఁడు.

అఫ్జుల్‌ఖాను—బీజపుర సేనాని.

ఫెజిల్‌ఖాను—అఫ్జుల్‌ఖాను కుమారుఁడు.

ఆలీఆదిల్‌షాహా—బీజపురపు సుల్తాను.

ఖాన్ మహమ్మదు—బీజపుర ప్రధానమంత్రి.

బలవంతరావు—అఫ్జుల్‌ఖానునను చరుఁడు.

దిలేర్‌ఖాను—కారాగృహాధిపతి.

పహార్‌సింగు—చోరనాయకుఁడు.

గోపాల్‌సింగు—పహార్‌సింగు దత్తపుత్త్రుఁడు.

మానసింగు—పహార్‌సింగు దాయాదుఁడు.

రామ, లక్ష్మణులు—పహార్‌సింగు భటులు.

వీరసింహుఁడు—

శివాజీ—మహారాష్ట్రరాజు.

చుండెను. వేణుగుల్మోదరములనుండి వనకుక్కుటముల కోలా హలము వినిపించుచుండెను. మలయపవనుఁడు మందమంద ముగా వీచుచుండెను. వ్యాసశాస్త్రి యా ప్రకృతిసౌందర్యమును జూచి ముగ్ధుఁడై పోవుచుండెను. ఆతఁడు తూర్పుదెస వయిపు చూచునప్పటికప్పుడే భానుమూర్తి పూర్వాద్రిపై నధిరో హించుచు నగపడెను. ప్రాంతపర్వతములనుండి పడుచున్న సెల యేళ్లపైన సూర్యకాంతులు ప్రసరించుటచే బంగరుమలాము చేసినట్లు తోఁచుచుండెను. పిల్లచేఁపలు నీటిమీఁద నత్యుల్లాస ముతోఁ దేలియాడుచుండెను. వ్యాసశాస్త్రి వానిని జూచు చుండఁగనే డేగ యొకటి తివ్వున నెగిరివచ్చి పిల్లచేఁప నొక దానిని కాళ్లతోఁ దన్నుకొని పోవుచుండెను. "అయ్యో! పాప మెంతలో హాసి చేకూరెను?" అని యాతఁడు తనలోఁ దాను మెల్లఁగా ననుకొనుచుండెను. అంతట మానవపదధ్వని విన నయ్యెను. ఎదుటఁ జూచునప్పటికిఁ బల్లకిని కొందఱు బోయీలు మోసికొని వచ్చుచు నగపడిరి. సహజములగు కేకలను మాని వారిట్లు నిశ్శబ్దముగా వచ్చుటకుఁ గారణ మేమో యని యాతఁడు తలంపఁజొచ్చెను. అంతటఁ బల్లకితోఁ దానెఱింగిన యాశ్వికుఁడొకఁడు కలఁడని యాతఁడు గ్రహించెను. దగ్గ ఱకు వచ్చిన తోడనే వారి కీక్రిందిసంభాషణము జరగెను.

వ్యాసశాస్త్రి—మోహనా! నీప్రభు వగు వీరభద్రు నకు క్షేమమా? ఆతనిసోదరుఁడు రంగనాథుఁడు సుఖమై యున్నాఁడా? మాయల్లుఁడగు శ్యామసుందరుఁడు సురక్షిత ముగా నున్నాఁడా? తక్కినయందఱక్షేమము నెఱింగింపుము.

మోహనుఁడు—అందఱకును క్షేమమే. మ ఱేమియు విశేషములు లేవు.

అని చెప్పి యతఁడు తనదారిని దాను బోఁ బోయెను. పల్లకిమోయు బోయీలు నిశ్శబ్దముగా నడచుచుండుటయు, మోహనుఁడిట్లు తన ప్రశ్నములకు సరియగు ప్రత్యుత్తర మీయకుండుటయు, ఆతని కదివఱకుఁగల చెడువాడుకయు వ్యాసశాస్త్రిని సందిగ్ధస్వాంతునిగాఁ జేసివైచెను. ఆపల్లకియందున్న దెవరని శాస్త్రి మోహనుని ప్రశ్నించెను. అందుల కాతఁడించుక తొట్రుపాటునొంది, జబ్బుగానున్న తనసోదరుఁ డని ప్రత్యుత్తర మిచ్చెను. శాస్త్రికి మోహనునియెడ సందేహము జనించుటచే, తనకు వైద్యమునందుఁగల ప్రావీణ్యము నాతని కెఱుకపఱచి రోగి నొకసారి చూడనిమ్మని కోరెను. అందులకు మోహనుఁడు సమ్మతింపక, తన సోదరుని తెలివి సంధివిశేషముగా నున్నదనియు; పల్లకితలుపు తెఱచినచోఁ బరులకు దొరకకుండఁ బలాయితుఁ డగు ననియుఁ జెప్పి యాతని నాయుద్యమమునుండి మరల్పఁజూచెను. కాని శాస్త్రిమనమున నావంతయై యున్నసందేహము కొండంతయై, యాసవారీలో నున్నవారిని చూచుటకుఁ ద్వరపెట్టెను. మోహనుఁ డంతట సవారీ మోయువారిని నడవుఁ డని సంజ్ఞచేసెను. అది గాంచినవ్యాసశాస్త్రి పల్లకి కెదురుగాఁ దనగుఱ్ఱమును నిలువఁ బెట్టి "వలదు—వలదు—పోవలదు. నన్నాతని నొక్కసారి చూడనిండు" అని బోయీలను గద్దించిపలికెను. వారు తన్ను లక్ష్యపెట్టక పోఁజూచుట గాంచి కృపాణము నొరనుండి పెఱికి పదునులేనివైపునఁ బల్లకివాని నొకనిని మోఁదెను.

అది యంతయుఁ గాంచినబోయీలా సవారీని దింపి తమచేతికత్తులతో వ్యాసశాస్త్రిపైఁ బడిరి. శాస్త్రియనుచరు లాతనికి సహాయులై శత్రువుల నెదుర్కొనిరి. మోహనుఁడు కత్తి దీసి శాస్త్రిపైఁ దలపడెను గాని సాముగరిడీలయం దసమానమైన పాండిత్యముగల వ్యాసశాస్త్రిని జయించుట కాతని కెట్లు సాధ్య మగును? కొలఁదికాలముననే యాబ్రాహ్మణ వీరునిచేతి కృపాణాఘాతముచే మోహనుఁడు నేలఁబడెను. తమ నాయకుని మరణమును జూచినంతనే బోయీ లందఱును పలాయనమంత్రమును పఠించిరి.

వ్యాసశాస్త్రి పల్లకితలుపులు దెఱచి యందున్నవా రెవరో యని తొంగిచూచి నిశ్చేష్టితుఁడై పోయెను. అసమాన సాహసోపేతుఁడగు వ్యాసశాస్త్రిని స్తంభీభూతునిగాఁ జేయఁ జాలిన దాపల్లకియం దేమి యున్నదో? అం దున్నవాఁడు పూర్ణశశాంకుసంబోలు బాలుఁడు ఆతని విశాలనేత్రముల నుండి కురియు బాష్పధారలు ముద్దుగులుకుచు నిద్దంపుఁజెక్కుళ్లపైఁ బడుచుండెను. పండుటాకువంటి యాతని దేహము మించు వాడియుండెను. పాపము! మృణాళసదృశములగు నాతని కరచరణంబులు కఠినత్రాళ్లచేఁ గట్టఁ బడెను. ఎప్పటికైనను వీలు గానటు లాగాలుసి నోట గుడ్డలు క్రుక్కుట కాక్రూరుల కెట్లు మన సొప్పెనో కదా! అట్టిదుస్స్థితిలో నున్నవానిఁ జూచినను జాలి పుట్టునే, తనయల్లుని నట్టిస్థితిలోఁ గాంచిన వ్యాసశాస్త్రి స్తబ్ధుఁ డాయె ననిన వింత యేమి?

అతఁడట్లే నిలిచియుండ నాతనియనుచరు లాబాలుని బంధనముల వదల్చిరి. వ్యాసశాస్త్రి యల్లుని చేరఁదీసి ముద్దాడి

యనేకవిధముల నోదార్చెను. ప్రస్తుతాంశమునుగూర్చి యడిగిన నేడ్చునేమో యని యాతని నేమియు నడుగక తనయనుచరుల నాబాలుని దీసికొని రంగనాథుని గృహమువంకకు మెల్లఁగ నడవ నాజ్ఞాపించెను. పిమ్మట మృతుఁడగు మోహనునిజేబులు త్వరగా వెదకి యందు దొరకినజాబులు చేకొని భృత్యులఁ గలసికొనియెను.

---

## రెండవ ప్రకరణము.

### వీరభద్రుని కుట్ర.

రంగనాథుఁడు పండరిపురమున ధర్మకర్త. ఆతనికి వీరభద్రుఁ డను తమ్ముఁ డొకఁడు గలఁడు. అతఁడు దుర్వ్యసనలోలుఁడై తనభాగమునకు వచ్చినయాస్తినంతయు జూదమునకును పానమునకును వేశ్యలకును వెచ్చించి, తినుట కన్నమైనను లేనిసమయమున నగ్రజునియింటి కరుదెంచెను. ధనహీనుఁడగు నాతఁ డెట్లైనను భాగ్యవంతుఁ డైనఁగాని మునుపటివలె స్వేచ్ఛావిహారము సలుపుటకు వీలుగా దని యెఱింగి, న్యాయాన్యాయ విచారశూన్యుఁ డగుటచేతన సోదరధనాపేక్షితుఁ డాయెను. అతఁడు రంగనాథుని గృహమునకుఁ జేరినది మొదలు, తనయన్నకుమారుఁడగు శ్యామసుందరునియం దపారమయిన ప్రేమను జూపుచు వినోదకథలచే నతని మనమును రంజింపఁజేయుచుండెను. కొన్నిదినము లిట్లు గడచినతోడనే యాబాలుఁడు వీరభద్రునియొద్దకు మిగులఁ జనవుగఁ బోవుచు

రాత్రులందుఁ గథాశ్రవణ కుతూహలముచేత నాతనికడనే శయనించుచుండెడివాఁడు.

రంగనాథునిగృహ మతిరమణీయ మగు నొకసౌధరాజము. అది వేసవి యగుటచే వీరభద్రుఁ డాయింటిడాబాపై మంచ మమర్చికొని శయనించెడివాఁడు. ఒకనాఁటిరాత్రి యాతఁడు తనమంచముపైని పవళించి శ్యామసుందరుని కతిరమణీయ మగు నొకకథ చెప్పుచుండెను. తొమ్మిదవగంట కొట్టునప్పటి కాబాలుఁడు గాఢనిద్రాముద్రితుఁ డాయెను. ఆనాఁ డేలకో కాని వీరభద్రుఁడు నిదురవ్రాక యటు నిటు పచారు చేయుచుండెను. తారాపతి నభోమధ్యమునఁ జేరినంతనే వీరభద్రుఁ డత్యాతురుఁడై డాబాపైనుండి యింటివెనుకభాగమునకుఁ దనదృష్టినిఁ బ్రసరింపఁ జేయుచుండెను. ఇట్లొకింతకాలము గడచినపిదప, ఉడు మొకటి యాడాబాయంచులనున్న పిట్టగోడను పట్టుకొనెను. దానికాలికి బలమగు త్రాడొకటి కట్టఁబడియుండెను. దానిని చూచినంతనే వీరభద్రుఁడు జేబులోనున్న చెకుముకిరాతిని దీసి వెలుఁగు గలుగునట్లు గావించెను. వెంటనే పగ్గము వెంబడి నెక్కి యొకమనుజుఁ డాడాబాపైకి వచ్చెను. వా రిరువురు నేదియో యైదారునిమిషములు రహస్యసంభాషణము గావించుకొనిరి. వెంటనే వీరభద్రుఁడొకసీసాను, తనపాన్పుపైనున్న యొకయుత్తరీయమును ఆనూతనపురుషుని కిచ్చెను. అతఁడు వీరభద్రుని బంధించి నోట గుడ్డలు క్రుక్కి యాసీసాను మంచముపై నిదురించుచున్న బాలునకు వాసనచూపెను. తరువాత నొకటిరెండుసార్లాకుఱ్ఱవానిని తట్టి చూచెను గాని యాతఁడు మేల్కాంచలేదు.

ఆసీసాలోనిది మత్తుమందై యుండనోపును. అంత నామోటు మానిసి, బాలుని తనబాహుపంజరమున నిడుకొని వడివడిగాఁ దా నెక్కివచ్చినపగ్గముగుండా దిగిపోయెను.

రంగనాథుఁడు తెల్లవాఱినపిదప లేచి ప్రాతఃకాలకృత్యములను గావించికొని తనపుత్త్రుఁ డెప్పటివలెఁ దనకడకు రాకుండుటచే డాబాపై కరుగుదెంచెను తమ్మునిదురవస్థం గాంచిన తోడనే యాతనిగుండె జల్లు మని రెండుమూఁడడుగులు వెనుకకు వైచెను. తరువాత నతనికట్లు విప్పివైచి తన కుమారునింగూర్చియు, ఆరాత్రి జరగిన ఘోరదారుణముం గూర్చియు నాతని ననేకప్రశ్నము లడిగెను. వీరభద్రుఁడు తనకుఁ దెలిసినదంతయు మఱుఁగుపఱిచి యెవ్వఁడో వెనుకపాటున నచ్చి తన్ను బంధించి నోట గుడ్డలు క్రుక్కి బాలు నెత్తుకొని పోయెనని యతి విషాదకరములగు మాటలతోఁ దెలిపెను. పెన్నిధిని గోలుపోయిన పేదవాని చందమున రంగనాథుఁడు నిలువునఁ గూలఁబడెను. దురాత్ములదురుద్దేశములఁ బాడగాంచుట కాపరాత్పరునకుఁ దప్ప మఱెవరికైనను సాధ్యమా ? ఈ దుర్వార్త పట్టణ మంతయు క్షణకాలమున వ్యాపించిపోయెను. ఏవంకఁ జూచినను శ్యామసుందరుని యదృశ్యతనుగూర్చి మాటలాడువారే. నాల్గువైపులకును రక్షకభటులు పంపఁబడిరి. రంగనాథ వీరభద్రులుగూడ బాలు నన్వేషించుటకుఁ జెఱియొకవంకకును వెడలిరి. ఇట్టి సమయముననే వ్యాసశాస్త్రి తనయునుచరులచే బల్లకి మోయించుకొని రంగనాథునిగృహమును జేరెను. అంత వఱకును దుఃఖాక్రాంతులై యున్న రంగనాథుని యింటివారందఱును, వీరిరాకచే సంతోషసాగర నిమగ్నులైరి. రంగ

నాథుఁడు పుత్త్రుఁడు దొరకె నని తెలిసినతోడనే పరమా నందభరితుఁడై సోదరసహితముగా నచటికి వచ్చెను. వీరభద్రుని మోముమాత్రము వెలవెలఁబోవుచుండెను. వ్యాసశాస్త్రి తులజాపురమున జరగఁబోవు మహోత్సవములకు వీరిని గొనిపోవ వచ్చుచుండుట మొదలు తాను పండరిపురము చేరు దనుక జరగిన వృత్తాంత మంతయుఁ బూసగ్రుచ్చినట్లు వారికి వినిపించెను. వీరభద్రుఁడు మోహనుని పలువిధముల దూషించుచుండెను గాని వ్యాసశాస్త్రిమాత్రి మట్టిసమయములం దాతనిపైఁ గ్రూరదృష్టులఁ బఱపుచుండెను. భోజనానంతరము శాస్త్రి రంగనాథు నొకగదిలోనికిఁ గొనిపోయి తలుపులు బిగించి తాను మోహనునికడ గ్రహించిన లేఖ నాతని చేతి కిచ్చెను. ఆజాబు విప్పి రంగనాథుఁ డీక్రిందవిధమునఁ జదివెను.

పండరిపురము.

ఫాల్గున బహుళ నవమి.

"ప్రియ మోహనా !

ధనమూల మిదం జగ" త్తను పండితవాక్యము నీ వెఱింగినదే కదా! బ్రదికియున్న కొలఁది రోజులలోను సౌఖ్యాంబుధి నోలలాడవలయును గాని విచారభరితుల మైన లాభ మేమి? ఇచట నేను ధనాధిదేవత నుపాసించుచున్నాఁడను. నేఁటి కాదేవి ప్రత్యక్ష మైనది. నేఁ జెప్పఁబోవునది సావధాన చిత్తుఁడవై గ్రహించి యందున్నటు లాచరించితివేని మనము ధనికుల మగుదుము.

నీ విపుడు నా సౌభాగ్యమునకును నీ శ్రేయస్సునకును జేయువలసిన కార్య మేమనిన, రేపురాత్రి పండ్రెండుగంటలకు మా యగ్రజుని సౌధపుదొడ్డివైపునకు రమ్ము. నేను డాబాపైని శ్యామసుందరునితోఁ బండుకొనియుందును. నీవు వలయు పరికరములఁ గొని వచ్చి నన్నుఁ జేరితివేని శ్యామసుందరుని నీ కొసంగెదను. వాని నొకబానిసగా దూరదేశమున విక్రయించి నాసోదరుని యమసదనమున కంపినచో నేనే యాతనిధనమునకు యజమానుఁడ నయ్యెదను. నీతోడ నొక పల్లకియు విశ్వాసపాత్రులగు బోయీలను గొనిరమ్ము. నాయాజ్ఞలన్నియు శిరసావహించి బీజపురమున నీసోదరునికడ శ్యామసుందరు నుంచవలయును. నీకొఱకు నిదురపోక వేచియుండెద.

ఇట్లు,

నీ శ్రేయోభిలాషి,

వీరభద్రశాస్త్రి.

ఈజాబు చదువుచున్నపుడు రంగనాథునికన్నులనుండి యశ్రుధారలు గారుచుండెను. లేఖను సాంతముగాఁ బఠించిన పిదప దాని క్రిందిభాగమున

"ద్రోహులగు పురుషులు మాయింట నుండఁదగరు"

అని లిఖించి యొకభటునిచేత వీరభద్రున కంపెను. ఆజాబందినతోడనే వీరభద్రుఁడు నిశ్చేష్టితుఁడై పోయెను. కొంతసేపైన పిదప నాతఁడు తల పంకించి "కానిమ్ము. తాటాకు చప్పుళ్లకుఁ గుందేళ్లు బెదరవు" అని పలికి యాయిల్లు విడిచి వనమార్గమును బట్టి యెటకో పోయెను.

## మూఁడవ ప్రకరణము.

### కాశీ ప్రయాణము.

మోహనుఁడు శ్యామసుందరునిం గొనిపోయిననాఁడు వానితల్లి పద్మాక్షి, బాలుఁడు మరల దొరకినచో నెల రోజులు దాఁటకమున్నే పుత్త్రసహితముగాఁ గాశీవిశ్వనాథుని దర్శింతు నని మ్రొక్కుకొనెను. ఆ కారణమున వ్యాసశాస్త్రి, యల్లుని తన గృహమునకుఁ దోడుకొని పోవలేకపోయెను గాని; సమయమున కాతనిని రక్షింపఁగలిగితిని గదా యని మాత్రము సంతసించుచుండెను.

ఈ కథ జరగిన కాలమున నిప్పటివలెఁ బొగబండ్లు గాని, చక్కని రాజమార్గములు గాని లేవు. కావున యాత్రికులు నిర్ణీతస్థానమును జేరుటకు వ్యయప్రయాసములకు లోనగుటయేకాక దోపిడిగాండ్రవలనఁ బెక్కు చిక్కులను గూడ నొందు చుండెడివారు.

శ్యామసుందరుఁ డట్లు మోహనునిబారినుండి విడివడిన యిరువదిరోజులలోపుననే నూఱుగురు భటులతోడను మూఁడు బండ్లతోడను వారణాసియాత్రకు బయలుదేఱెను. నాలైదు దినము లిట్లు ప్రయాణము గావించినపిదప వారి కొక దుర్గమారణ్యమార్గమునఁ బోవవలసి వచ్చెను.

ఆవనమునకు “పహార్‌సిం” గను క్షత్త్రియుఁ డొకఁడు పాలకుఁడై యుండెను. అతఁ డొక దొంగలగుంపునకు నాయకుఁడు. గంజాయితోఁటలోఁ దులసిమొక్కరీతి నాదుర్గమున కిం

చుక రాజభక్తి మాత్రముగలదు. అతఁ డేకార్య మొనరింపుఁ డన్న నది యొనర్చుటే కాని, యేల యీపని చేయవలయునని, యడుగుట కాతనియనుచరులు భయపడు చుందురు. విత్త మార్జించుట కాతఁ డే పనినైనను జేయుచుండును. వీరభద్రు డెటులైనను సోదరునిఁ జంపి శ్యామసుందరుని నెత్తుకొని పోఁ దలంచి పహర్ సింగుకడ కేఁగి తనయగ్రజుని మరణము వలనఁ దా నెట్టి ధనవంతుఁ డగునో విశదీకరించెను. తన యుద్దేశ ములు నిర్విఘ్నముగాఁ గొనసాగినచోఁ దనకు రాఁబోవు లాభమున నాల్గవవం తాదొంగలనాయకున కొసంగెద నని కూడ వాగ్దాన మొనరించెను.

ఒకనాఁటి ప్రయాణమున రంగనాథుని కుటుంబ మను చరసహితముగా నొకయరణ్యమార్గమునఁ బోవుచుండఁగా వీరభద్రుని యధీనమునం దున్న దొంగలగుం పొకటి వారిని చుట్టుముట్టెను. పద్మాక్షీ బాలు నెత్తుకొని బండిలోనుండి దిగి నిశ్చేష్టితురాలై నిలువఁబడిపోయెను.

వీరభద్రుఁ డంతట రంగనాథునిపైఁ దలపడి "ద్రోహు లగు పురుషులు నీయింట నుండఁదగనిచో, వీరభద్రుని కెదు రాడువా రీప్రపంచమున నుండఁదగరు." అని గర్జించుచు నాతనిం దనకరవాలముచే మోఁద యత్నించుచుండెను. రంగ నాథుఁ డీదెబ్బల నాఁపుకొనుచు "భ్రాతృద్రోహీ! నేఁటితో నీ యాయుష్య సంపూర్ణ మైనది." అని కృపాణసహిత మగు తన దక్షిణహస్తము నెత్తెను. అంతట యుద్ధధర్మము నైనను పాటింపని యొకదొంగ యాతని కుడి చేతిని ఖండించివైచెను.

వీరభద్రుఁడు వెంటనే తనసోదరునికంఠముపైని తనచేతి కత్తి విసరుచుండ దాపుననున్న పద్మాక్షి యాదెబ్బ కడ్డువచ్చుటచే నాలలనామణిదేహమున కది తగిలి యామె నేలఁ గూలెను. పోటుపడిన వ్యాఘ్రముచందమున రంగనాథుఁడు ఖడ్గమును వామహస్తమునఁ దాల్చి యొక్క వేటుతో వీరభద్రుని యమసదనమున కంపెను. అంతట వెనుకనుండి వచ్చి యొక చోరుఁడు కృపాణాఘాతమున నతని శిరమును ఛేదింప నాతఁడు వీరస్వర్గమును జూఱగొనెను. యజమానునిమరణమును గాంచి యనుచరులు పలాయితు లయిరి.

బాలుని గొనిర మ్మని పహార్‌సిం గాజ్ఞాపించుటచే నా చోరు లాతని నొక యాశ్వికున కప్పగించి తమ నాయకునిచేత నాజ్ఞాపింపఁబడిన మఱియొకదోపిడి చేయుటకు వెడలిపోయిరి. ఆయాశ్వికుఁడుమాత్రము పహార్‌సింగుకోటవైపు పోయెను.

తా నొకటి దలఁచిన దైవ మొకటి తలఁచు నన్నట్లు వీరభద్రునిదురుద్దేశములు కొనసాగకపోవుటయే కాక యాతఁడు జీవమును గూడఁ బాయవలసినవాఁ డాయెను.

రంగనాథుని కుటుంబము నిర్మూల మైన దని పండరి పురపౌరు లందఱకును దెలిసిపోయెను. ఈ విషాదవార్త త్వర గానే తులజాపురముకూడఁ జేరెను. పాప ! మా కళావతి తనకు గలిగిన యాపదను గ్రహించునంతటి వయసు గలదికూడఁగాదు. అటుతరువాతను పండ్రెండు సంవత్సరములు గడచెను. ఆబాల నానాఁటి కతిలోక మోహాన విగ్రహముగా మాఱుచుండెను. వితంతు వగుటచే నామె కిహలోకసౌఖ్యములు చాలవఱకును

దూరమాయెను. ఇట్టి దుర్భరవైధవ్యబాధ పెక్కండ్రు కాంతలకుఁ గలుగుచున్నను, ఆ నాఁటిపౌరులు సంఘసంస్కారమునందు మన సుంచరైరి.

---

## నాల్గవ ప్రకరణము.

### వ్యాసశాస్త్రి కుటుంబస్థితి.

భారతదేశమునఁ బ్రఖ్యాతి గాంచిన పుణ్యక్షేత్రములలో దక్షిణహిందూస్థానమున వెలసిన తులజాపుర మనునదొకటి. ఆ ప్రదేశముననే మహేశ్వరుని యర్ధాంగి తులజాదేవి లోకకంటకుఁడైన మహిషాసురుని వధించి ప్రజలను రక్షించెననునొక ప్రతీతి గలదు. మహారాష్ట్రులా దేవిని కాళి, భవాని మొదలగు పలునామములచే నతిభక్తి శ్రద్ధలతోఁ బూజించుచుందురు. మహిషాసురుని వధించు సమయమున నాహిమాచలతనయ భీకరరూపధారిణి యాయె ననియు, తాను కృతకృత్యయైనపిదప సమీపముననున్న పాపనాశన మను గుండమున స్నానము గావించె ననియును ప్రజ లెన్నుచుండిరి. గంభీరమైన యారూపముతోడనే కృష్ణవర్ణ సమన్విత మగు శిలావిగ్రహ మొకటి యాప్రదేశమునందు వెలసెను. ఆ దేవి సౌందర్యము వర్ణనాతీతము; నిరుపమానము! గుండ్రనై కళల నీనెడు చక్కనిముఖము, నిగనిగలాడెడు చెక్కుటద్దములు, విశాలమైన ఫాలము, తిలపుష్పమును మించునాసిక, చిఱునవ్వునకుఁ బుట్టినిండో యనునట్టి రదనములు గలిగి యాదేవి మూర్తి భక్తిభావమును బెంపొందఁ జేయు చుండెను. అట్టి

నిరుపమాన సుందరాకారమున కామెలోచనయుగముమాత్ర మించుక యుగ్రభావమును గల్పించుచుండును. వినిర్మల మై యొప్పు నీలాకాశమునఁ బ్రాతఃకాలమున భాను బింబములు రెండుదయించెనో యనునటులు రెండు కెంపు లావిగ్రహాము నకు నయనములుగా నమర్పఁబడి యుండెను.

ఆ భవానీప్రతిమ, మహిషాసురుఁడు చంపఁబడిన స్థల మగు పెద్దలోయకుఁ గ్రిందుభాగమున నుండెను. ఆ విగ్రహాము నకు గోపురమణిమంటపరుగ్దీపిత మగు నొక దేవాలయము కట్టఁబడెను. ప్రాంత పర్వతములనుండి వచ్చుచుండు జలధారలచేఁ జెఱువులు పూరింపఁబడి యాత్రికుల స్నానాదికృత్యముల కుప యోగపడుచుండెను. ఆలయము ప్రహరిచుట్టను తులజాపురము నిర్మింపఁబడియెను. ఆపట్టణ మతిపురాతన మైనదే యైనను రమణీయసౌధరాజములచేత నొప్పుచుఁ జూపఱకుఁ గన్నుల పండు వగుచుండెను. ఆ పురమున నేవంకఁజూచినను ఆ దేవి మాహాత్మ్యము పొగడువారే. ఏగేహ మరసినను విద్యావివాద నిరతులగు పండితులే. ఏదిక్కునఁ జూచినను జలపూరితము లగు కాసారములే. వేయేల? తులజాపురము సిరిసంపదల కాకరమై, విద్యా సౌశీల్యములకు నెలవై, దానధర్మముల కాటపట్టై, శౌర్యధైర్యముల కాలవాలమై పొల్పారుచుండెను. దాని కుత్తరపశ్చిమదిక్కులయందుఁ బ్రకృతిసౌందర్య విరాజ మానములగు పర్వతపంక్తులును, దక్షిణమున నొకచక్కని మైదానమును, పూర్వభాగమున సస్యశ్యామలములగు పొల ములు, తోఁటలు మున్నగునవియు నమరియుండెను.

ఆపురమున నివసించువారందఱిలోను వ్యాసశాస్త్రి మహావిద్వాంసుఁడును మాననీయుఁడునై యుండెను. ఆతనికి జ్యోతిషమునందును, వైద్యమునందును నిరుపమానమైన పాండిత్యము గలదు. గయ, కాశి మొదలగు ప్రదేశములయందు జరిగెడు వేదాంతచర్చలయం దాతఁ డనేకపర్యాయములు గెలుపొంది విఖ్యాతిఁ బడసెను. తర్కశాస్త్రమునం దాతనిది వెట్టినది పేరు. చిన్ననాఁడే యతఁడు మల్లయుద్ధమునందును, కత్తిసామునందును కడు నేర్పరియై యుండెను. పితృపితామహార్జితములగు భూము లతని కనేకము కలవు. మహాపండితుఁ డగుటచేఁ దేవాలయమున కతఁడు ధర్మకర్తయై మిక్కుటమగు యశమును సంపాదించెను. పసిఁడికిఁ దావి యబ్బినటు లతని సౌభాగ్యమునకు ధర్మగుణ మనునది వన్నె వెట్టుచుండెను. ఐశ్వర్యమునఁ గుబేరుఁడును; దానమునఁ గర్ణుఁడును, పాండిత్యమున బృహస్పతియునై వెలుఁగొందుచున్నను 'పుత్రహీనుఁడను గదా' యను విషాదము మాత్ర మతనిని వీడలేదు. అనేకములు యాగములను, తీర్థయాత్రలను, వ్రతములను, దాన ధర్మములను చేసినను. ఆపరమేశ్వరుఁ డతని కొక్క కుమారునైనను బ్రసాదింపలేదు. అతని సహధర్మచారిణియగు ఆనందాబాయి కడు పతివ్రతయు, భక్తురాలునై యుండెను. ఆదంపతులకు సహజ సౌందర్యశాలిని కళావతి యను కుమారీరత్నము గలదు. ఆ బాలికకు మూఁడేండ్లప్రాయము రాఁగానే వ్యాసశాస్త్రి యామెను రంగనాథునికుమారుఁడగు శ్యామసుందరునకిచ్చి వివాహము గావించెను. రంగనాథుని కుటుంబము నాశన మయిన దని యాతనిభృత్త్యు లెఱింగించు

టచే కళావతి వితంతు వాయె నని నిశ్చయింపఁబడెను. వ్యాసశాస్త్రి విద్యాగరిష్ఠుం డగుటచేఁ దనకొమార్తకు విద్య గఱప నారంభించి క్రమక్రమముగా సంస్కృత భాషారహస్యములను, పెక్కుశాస్త్రములను, గఱపెను. శ్రద్ధాబుద్ధులు గలవారికిఁ బాండిత్య మబ్బు టన నెంత? కొలఁది సంవత్సరములలో నామె సకలశాస్త్రపారంగతయై విద్యకుఁ దగుబుద్ధిని, బుద్ధి కెనయగు రూపమును గలిగి యుండెను. గ్రంథపఠననిమగ్నయగు కళావతిం గాంచి పౌరు లనేకులు గర్హించుచుండిరి. ఒకనాఁటి రాత్రి వ్యాసశాస్త్రి శయనమందిరమున విషాదసూచకములయిన నయనములతోఁ గూర్చుండియుండెను. ఆనందాబాయి మెల్లఁగఁ దలుపు దెఱచికొని లోని కేతెంచి భర్తపార్శ్వమున నాసీనయై "ప్రియా! ఏల యిట్లు చింతించుచుంటిరి?" అని యడిగెను.

వ్యాసశాస్త్రి—ప్రేయసీ! వచ్చితివా? మన కొమార్తను గూర్చియే యోజించు చుంటిని. నేఁడు శంకరాచార్యస్వాములవారియొద్దనుండి నా కొకలేఖవచ్చినది. మనతనూజను శిరోజహీనను జేయనిచోఁ గుటుంబగౌరవము పోవుననియు, బహిష్కారపత్రిక పంపఁబడుననియు సూచించిరి. మనబిడ్డ నిట్టి క్రూరాచారమున కెట్లు బలి యొసంగుదును? ఆచార్యుని ధిక్కరింతు నందునా, ప్రజలు నన్ను వేవిధంబుల నిందింతురు. ఏమిసేయుటకును దోఁచకున్నది.

ఆనంద— జనులు మనల దూషించిన దూషింతురుగాక. మన పుత్త్రిక కట్టిదురవస్థ నాపాదింపఁ దలపెట్టకుఁడు. మనలను బంధుగులు విసర్జించిన మన కేమిలోటు?

వ్యాస—ఏమిలోటుందు వేమి ? జననీజనకుల యుపరకృత్యములు కూడ జరగుట దుష్కరము. మన మెప్పుడైనను వ్యాధులపాలైనచో సానుభూతినైనఁ జూపువా రుండరు. కాలవశమున నేను మరణించినచో నీవును మనకొమార్తెయుఁ గఠినహృదయు లగు బ్రాహ్మణులపా లగుదురు. మీా కెంతధన మున్నను మీాపైగల కోపముచేత, వారు మిమ్ములను పలుబాధలఁ బెట్టెదరు. మీారు సొంతముగా సంసారసాగరము నీదఁజాలరు గదా ?

ఆనంద—భవానికృపవలన నట్టి దేదియును జరగకుండుఁగాక! మనకు వృద్ధత్వము వచ్చునపుడు మనల సంరక్షించువాఁడొకఁ డుండవలయును గాన మిమ్ములను ద్వితీయవివాహము చేసికొనవలయు నని ప్రార్థించుచున్నాను. దైవకృప వలన నామీాకైన నొక కుమారుఁడు జనించినచో మనము ముదుసలుల మగునప్పటికి అతఁడు మనల సంరక్షింప సమర్థుఁడగును గదా !

వ్యాస—ఆనందా ! ఆమాట నింకఁ గలవెట్టవలదు. ఇంకొక వత్సరము జీవించియున్నచో నప్పుడాలోచించుకొనవచ్చును.

నంద—అట్లే కానిండు. ప్రస్తుతము మన మీాయాపదనుండి గట్టెక్కు మార్గ మేమైన నాలోచించితిరా ?

వ్యాస—దేవియే మనల నిప్పుడు రక్షింపవలయును. అన్యథా శరణము లేదు. దీనరక్షణదీక్షాకంకణ యగు నామాత మనల నుపేక్షించునా ? ఆపరాత్పరుగా లెట్లు తలంచిన నట్లగునుగాక !

అని వారిరువురను భోజనార్థము వంటశాల కరిగిరి. కుమారీసహితులై భోజనము గావించినపిదపఁ బురాణపఠనము గావించి వారివారిశయ్యలఁ జేరిరి. కళావతి చాలరాత్రి వఱకును తల్పమున నిటు నటుఁ బొరలుచు, విగ్రహామును తన హృదయఫలకమునఁ జిత్రించుకొనుచుఁ గాలము గడపెను. కొంతకాలమున కామెయు గాఢనిద్రా ముద్రిత యయ్యెను.

తండ్రియగు వ్యాసశాస్త్రి నిద్రనుండి లేవకముందే యామె మేలుకొని కాల్యకృత్యములను దీర్చుకొనెను. నాఁడేమో యామెముఖమున నూతనవికాసము గానిపించుచుండెను. కొఁదిలసేపటికే యామెజనకుఁడు లేచి స్నానాదికృత్యములఁ గావించుకొని వచ్చునప్పటి కామె యొకవసారాలోఁ గూరుచుండి కంపితదేహాముతో భగవద్గీత పారాయణము గావించుచుండెను. ఆయన కొమార్తను చేరఁదీసి "అమ్మా! ఇట్లు వణఁకుచుంటి వేల? దేహామం దస్వస్థత యేమియు లేదు గదా? అని యడిగెను.

కళావతి—ఏమియును లేదుగాని నిన్నటిరాత్రి నేను గలలో గాంచిన సుందరరూపము న న్నిప్పటికిని పులకితదేహాను గావించుచున్నది.

వ్యాస—నీ యస్వస్థత కా స్వప్నమే కారణమా యేమి?

కళావతి—స్వప్నమా? నా కది యంతయుఁ గన్నులఁ గట్టినటు లున్నది. ఆదేవియసమానరూపము నా మనమున నాటిపోయినది.

వ్యాస—కుమారీ! నీవు కలలోఁ గాంచినది వివశదీకరింపుము.

కళా—కన్నులు మూసితినా, నిన్నటిరాత్రి నేఁ గాంచిన త్రిజగన్మోహనవిగ్రహము గానిపించుచుండును. ఏమి యాలోచనయుగముసౌమ్యత! ఆరక్తనేత్రములు తప్పఁదక్కిన యాకార మంతయును తులజాదేవిని బోలియున్నది. ఆ మాతయే యిట్టి శాంతరూపముతోఁ బ్రత్యక్షమైన దని తలంచి భక్తిభావోద్రేకమున ననేకవిధంబులుగా స్తుతించితిని. తెప్పవాల్చితినా కరుణారస ప్రపూరితములైన తరళ నయనములతో తులజామాతయే నా యెదుటఁ గానిపించుచున్నది.

వ్యాస—ఆదేవి నీ కేమైన సెలవిచ్చెనా?

కళావతి—నా కేశపాశమును చేత నిమురుచు, నన్ను సేవించి నచో నీవేణిని రక్షించెద, నని మృదుమధుర భాషణంబులఁ బలికి యంతర్ధాన మాయెను. నే నంతట నిద్ర మేల్కాంచి చూచితిని గాని యా దేవిరూపము నాహృదయమునసే కాని మఱెందును గానసైతిని. ఆమాతకు శక్తి వంచన లేకుండ సేవఁ జేయవలెనని నామనము వువ్విళ్లూరుచున్నది. పాల ముంచినను నీట ముంచినను ఆదేవిదే భారము.

వ్యాస—పుత్రీ కారత్నమా! నేను శ్రీదేవ్యాలయమున కీక్షణమున నే పోయెదను. నీ జనని గృహకృత్యములు నెఱవేర్చుకొనిన పిదప మీరిరువురును శ్రీదేవీదర్శనమునకు రండు. నిన్ను స్వీకరించునో లేదో. యామె నడిగెదను.

అని చెప్పి యాతఁ డానందబాష్పధారా కలితకపోలయుగళుఁడై శ్రీదేవ్యాలయమునకుఁ జనియెను. కళావతి గీత

యందలి దొక్కొక్క శ్లోకమును జదువుచు నొక్కొక్కప్పుడు నిమీలితలోచనయై చింతించుచుఁ దల్లిరాక కెదురు చూచు చుండెను.

---

## అయిదవ ప్రకరణము.

### ముర్లీ.

" మ. ధరణీశోత్తమ! నీవు కేవలసముద్యద్భక్తి ధీయుక్తిమై
వరగోవింద పదారవిందయుగభాస్వన్నావ సంధించి దు
స్తరభూరివ్యసనాకరోల్లసితదుర్దాంతోగ్రగంభీరసం
సరణాంభోధిఁ దరింపవయ్యా! పరమోత్సాహంబు దీపింపఁగన్."

(భాగవతము.)

ప్రాతఃకాలమున భానుఁడు సహస్రకిరణములతో నాక సంబున నిలిచి తిమిరజాలమును పటాపంచలు గావించు చుండ, ఆనందాబాయి స్నానాదులను గావించుకొని శుచియై "కళావతీ! కళావతీ! దేవాలయమునకుఁ బోవుదము రమ్ము" అని పిలుచుచుండెను. గ్రంథపఠననిమగ్నయగు కళావతి పుస్తక మును మూసివైచి "అమ్మా! ఇదిగో వచ్చుచున్నాను" అని చెప్పుచు నిలువఁబడెను.

ఆమెసౌందర్యము వర్ణనాతీతమై యుండెను. సంపూర్ణ చంద్రబింబముతో సదృశంబగు నామెమోమునఁ జిఱునవ్వు మొలక లెత్తుచుండెను. అర్ధనిమీలితంబులైన నీలోత్పల నయనములచే నారమణీమణితనువు భాసిల్లుచుండెను. జాళువా పసిఁడిచాయను బురుడించు మేనికాంతియు, తుమ్మెదఱెక్కల

వలె నల్లనై నిగనిగలాడు నెఱికురులును, బటువులై మిటారించుచున్న వలుందపిఱుందులును, మెత్తనై యింపారు కులుకు పలుకులును ఆజవరాలి మేనఁ బుట్టినసొమ్ములై యుండెను. కలదా లేదా యనుసందియమును గల్పింపఁజాలు లేఁగౌనుపై మదగజకుంభములఁ బోలు వక్షోజములు చెన్నారుచుండెను. ఆమెనెన్నడలను గాంచినవారు, రాయంచల మందగమనమున కవి తీసిపో వని తలంపకపోరు. అక్కటా! ఇట్టి సౌందర్యవతి కావిధి యెట్లు వైధవ్యమును గల్పించెనో కదా? విధి యట్టి క్రూరకార్యమును ఘటించునా?

కళావతియందుఁ బొడకట్టు నూతనవికాసమును గాంచి యామెజనని యామె నందులకుఁ గారణ మే మని యడిగెను. అందుల కామె తాను రాత్రి గాంచిన స్వప్నమును, తండ్రి తనతోఁ జెప్పినసంగతులును పూసగ్రుచ్చినట్లు తల్లికి వినిపించి శ్రీదేవిసాన్నిధ్యమునకు బయలుదేఱెను. మార్గమధ్యమున గోముఖి యను జలధార కలదు. యాత్రికులు దేవాలయమున కేఁగుటకు ముం దచట స్నానము గావించు నాచారము కలదు గాని యాయూరివారికి మాత్ర మట్టినియమము లేదు. ఆ ప్రదేశమున కామె చేరినతోడనే తల్లివంకఁ దిరిగి "అమ్మా! దేవి ప్రత్యక్షరూపము గాంచికూడ నే నీయపరిశుద్ధవస్త్రములతో నామెదర్శన మెట్లు గావింతును? ఇచట స్నానము గావించి పరిశుద్ధముగ శ్రీదేవిని గాంచెదను." అని చెప్పెను. ఇట్టి చలిసమయమున స్నాన మాడుట తగ దని తల్లి బోధించెను. కళావతి యంతటితో నాఁగక తనకు శరీరమునఁ జాల వేఁడిగ నున్న దని చెప్పి తల్లి యనుమతి నొంది

యీ జలధారయందు స్నానము గావించెను. అటుపిమ్మటను వా రిరువురును కోవెలవంకకు నడవసాగిరి.

అప్పటికే శ్రీదేవీప్రతిమ కభిషేకాదులను గావించి, ఫాలమునఁ దిలకము సమర్చి యుత్సవవిగ్రహము నాలయము చుట్టు నూరేఁగించు చుండిరి. బ్రాహ్మణ పండితు లనేకులు ధ్యానశ్లోకముల నతిరమ్యముగఁ జదువుచుండిరి.

అట్టి తరుణములం దబలలు ధ్యానాంతరంగలై పురుష సమూహమునకు వెనుకఁ బోవుట యలవాటు. కళావతి నేఁడు జననిని విడిచి ద్విజసంఘమునకు ముందు నడచుచు, హస్తముల శిరముపై నటు నిటుఁ గదలించుచు వారు చదువుశ్లోకములను పఠించుచుండెను. వా రందుల కబ్బురపడుచు వ్యాసశాస్త్రి వంకఁ జూచి ప్రత్యుత్తరమున కెదురు చూచుచుండిరి. శాస్త్రి తనకొమార్తె తడిబట్టలతో నుండుటయు నూతన తేజోవిరాజ మాన యాకృతియుఁ గాంచి "నిన్నటిరేయి మాత యామెకు బ్రత్యక్షమైనది. ఆమెయిష్టము ప్రకారము నడవుఁడు" అని చెప్పెను. వా రందఱు నాలలనామణి వెనుక సేవాకాలముఁ జేయుచు నడవ మొదలిడిరి. కొంతసేపటికి వారు గర్భగుడి యెదుటికి వచ్చి నిశ్శబ్దముగా నాఁగిపోయిరి.

కళావతిమాత్ర మా దేవిసాన్నిధ్యమునకుఁ జని మోఁకరించి యున్మీలిత నేత్రములతో నామెవంకఁ జూచుచుండెను. ఆమందిరమున వెలుఁగుచున్న దీపకళిక లామెపైని నూతన కాంతులను బ్రసరింపఁజేయుచుండెను. సాంబ్రాణిధూపముతో నిండిన యాస్థలమందా దేవిరక్తనేత్రములు విద్యుత్కాంతుల నీనుచుండెను.

అట్టి సమయమునఁ గళావతి తులజాదేవి నెన్నియోవిధములఁ బ్రార్థింపఁదలంచెను గాని భక్తిభావోద్రేక పూరితయగు నారమణినోటనుండి "తల్లీ! స్వీకరించినను నిరాకరించినను నీదేభారము." అను పలుకులు తప్ప మతేమియు వెలువడ వయ్యె. ఇట్లు కొంతకాల మైనపిదప నామె బాహువులు శిరముపై కెత్తి, విడివడి నేలపైఁ బడుచున్న కేశములనైన ముడువక యుద్రేకపూరితయై "జననీ! నిన్నటిరాత్రి నాకు దర్శన మిచ్చినరూపమునఁ బ్రత్యక్షము గమ్మా, రమ్మా, నీ దాసానుదాసురాల నగునన్నుఁ గటాక్షింపుము ... ... అహా! త్రిలోకీమాతా! వచ్చితివా వచ్చితివా? రక్షింపుము—రక్షింపుము"... ... ... ...అని నేలపైన వ్రాలి బాష్పధారాకలితకపోలయగు గళ యాఱొను.

అది యంతయుఁ గాంచుచున్న వృద్ధమతాచార్యుఁ డొకఁడు తనచేత నున్న చితారుపై నొకశ్లోకమును వాయింప మొదలిడెను. తక్కిన బ్రాహ్మణు లందఱును బారులు దీర్చి నిలిచి యాశ్లోకమునే మనోహరముగా గానము చేయుచుండిరి.

కొంతసేపటికిఁ గళావతి లేచి నిలువఁబడి దేవి నిట్లభినుతి సేయఁదొడఁగెను. "త్రిలోకీ జననీ! నే నతి పాపాత్మురాల నని యెఱింగియు నాకు స్వప్నమున సాక్షాత్కరించి యిప్పుడు నన్ను స్వీకరించిన నీయపారకరుణను వర్ణింప నేరితరము? శిష్టరక్షణీబిరుదము నీ కెంతయుఁ దగియున్నది. మహిషాసురుని వధించి యార్తుల రక్షించిన నిన్నుఁ బూజించి నీదాసిగా నుండుటకు నీవలన ననుజ్ఞాత నైన నాయదృష్టమున కెంతయు సంతసిల్లుచున్నాను. దీనజనచకోరచంద్రమా!

నాయోపినకొలఁది నీ సేవఁ జేయుచు ధన్యురాల నయ్యెదను" అని చెప్పి మరల శ్రీదేవిసాన్నిధ్యమునఁ బడి సాష్టాంగ నమస్కారము గావించి తండ్రివంకకుఁ దిరిగి "తండ్రీ! పోవుదము రండు. నా మన సిప్పుడు నిర్మలముగా నున్న"దనెను.

అంత వృద్ధమతాచార్యుఁ డచటనున్న పౌరులవంకఁ దిరిగి "సోదరులారా! శ్రీదేవి స్వీకరించినకళావతికి గౌరవములు జరపుదము రండు. భజంత్రీపల్లకులఁ బిలువనంపుఁడు" అని పలికెను.

కళావతి కిట్టియుత్సవ మిష్టము లేకున్నను పెద్దల మాటలు ధిక్కరింపఁజాలని దగుటచే నచటివారందఱకును నమస్కరించి పల్లకియందుఁ గూరుచుండెను. ఆచారము ప్రకార మామెజననీజనకులును కొందఱు బ్రాహ్మణులు నా పల్లకి నెత్తినతోడనే "జయ భవానీ! జయ కాళీ! జయ తులజా!" యను శబ్దములచే దిక్కులు పిక్కటిల్లెను.

ఉత్సవమందలి జనులసంఖ్య నిమిష నిమిషమునకును పెరిఁగి పోవుచుండెను. వ్యాసశాస్త్రిగారి కొమార్త శ్రీదేవిచే మూర్తిగా స్వీకరింపఁబడెనను సంగతి పట్టణ మంతయు వ్యాపించెను. పౌరు లనేకులు గుంపులు గుంపులుగా వచ్చి యుత్సవమునఁ జేరుచుండిరి దేవాలయపు వాద్దెగాండ్రు శుభకరమగు గేయము నొకదానిని వాయింప మొదలిడిరి. ఊరేగింపు తూర్పు దేవిడీగుండా బయలు వెడలి పాపనాశనకుండము కడకు వచ్చి నిలిచెను. మఠాధికారు లచటఁ గళావతి కనేక వేదోక్త కర్మముల జరపి మంత్రబలముచేఁ బరిశుద్ధహృదయను గావించి

పురవీథులలో నూరేగించుచుండిరి. శుద్ధాంతకాంత లంతఃపుర
ములనుండి సంజళులను లాజలను ఆమెపైఁ జల్లిరి. సుగంధ
భూయిష్ఠ మగుసాంబ్రాణిధూపముచేతను పన్నీటిచేతను ఈ
యుత్సవము పోవుప్రదేశ మంతయు బరిమళించుచుండెను.

ఇట్లాయూరేగింపు తిరువీథు లన్నియు దిరిగి వ్యాస
శాస్త్రిగృహముకడ నిలిచిపోయెను. కళావతి పల్లకినుండి దిగు
నప్పటికి శక్తిహీనయై యుండెను. జననీ జనకు లామె నింటిలో
నికిఁ గొనిపోవుచు నచటికి విచ్చేసినవారు లందఱకును తమ
కృతజ్ఞతను సూచకముగా వందనముల నర్పించిరి. వృద్ధమతా
చార్యుఁడు శాస్త్రివంకఁ దిరిగి "సోదరా! నీ తనయ కొన్నిదిన
ములవఱకును బలహీనయై యుండును. ఇట్టి వనేకము నేనెఱుం
గుదును గాన యామె నతి జాగ్రత్తగా సంరక్షింపుడు" అని
చెప్పి వెడలిపోయెను.

## ఆఱవ ప్రకరణము.

### మోరోపంతు పన్నుగడలు.

"గీ. కటకటా! విత్త మెంతటి కలుషమయమొ
మానవంతుల నింతలో మానరహిత
కర్మలను గాఁగఁ జేయును క్షణములోన
కటకటా! విత్త మెంతటికలుషమయమొ?"

(ప్రాచీనగీతము.)

భానుఁడు తూర్పుదిక్కనుస్త్రీయం దత్యంతాను
రాగము గలవాఁడై దైవనియోగమునఁ బ్రియావియోగ

ముచేఁ గలిగిన తీవ్రతాపమున నుదయించినతన యుగ్రతచే భువనములను గూడఁ దపింపఁ జేయుచుఁ గ్రమముగా సన్నగిల్లిన తేజము గలవాఁడై శాంతత వహించి సంధ్యాకాషాయ ధారియై దుర్గమారణ్యాయుతమగు పశ్చిమశైలమునకు సంన్యాసియై పోవు చున్నాఁడో యనునటులు సాంధ్యరాగప్రభలు వరుణదిక్కునఁ దోఁచుచుండెను. తమకాంతుఁడు తమ్ము వీడి పోవుచుండె నని కాఁబోలు! పద్మినులముఖములు ముకుళించుకొని పోవుచుండెను. అట్టిసమయమున నుందరుఁ డగు నొకబ్రాహ్మణుఁడు తులజాపుర ప్రాంతమున నున్నచిన్నగుట్టపై నాసీనుఁడై యుండెను. నూతనార్చకురాలి నూరేగించు సమయమున నాతఁడు పల్లకి ప్రక్కనుండియే నడచుచు నామెపైనఁ బ్రేమసూచకదృష్టులను బఱపుచుండెను. కరిరాజు రాజమార్గమునఁ బోవుచున్నపుడు శునకము లఱచిన లక్ష్యము సేయునా? అట్టివానివంక నాగజము తిరిగి యైనఁ జూడనట్లు కళావతి మోహోపండితునివైపు చూడనే లేదు. అంతట డానాఁడు జరగిన సంగతు లన్నియు మనమునఁ దలపోయుచుఁ దనదురుద్దేశమును కొనసాగించుకొనుట కుపాయము నాలోచించు చుండెను. కళావతి కింక వైధవ్యబాధలు కలుగ వని సంతసించు చున్నను తనపాలఁ బడదేమో యన్నవిచార మాతనిని వీడ లేదు.

అట్టి సమయమునందే యొకసుందరి యచటికి వచ్చి "మోహోపండితశేఖరా! ఏమ ట్లాలోచించు చుంటివి?" అని ప్రశ్నించెను. అంతట నాతఁడు వెనుకకుఁ దిరిగి చూచి "గంగా! వచ్చితివా? కూర్చుండుము" అని చెప్ప నానుదతి

యాతని ప్రక్క నాసీనయై "నన్ను రమ్మనుటకుఁ గారణ మేమి ?" యని ప్రశ్నించెను.

మోరో—నీవు కడు బుద్ధిశాలిని వని నే నెఱుంగుదును. నేను జెప్పఁబోవు కార్యమున నీసామర్థ్యము నంతయు దారవోసి గెలు పొందితివా నీవు ధనికురాల వగునట్లు చేసెదను.

గంగ—ఆ కార్య మేదియో చెప్పకున్న నెట్లు ?

మోరో—ఎఱుంగుదువు గదా వ్యాసశాస్త్రిగారి కొమార్త యగు కళావతిని ? ఆమె నాచేఁ జిక్కునటులు చేసినచో వేయినిష్కములు బహుమానము గావించెదను.

గంగ—నిశ్చయముగా ? అట్లు ప్రతినఁ జేయుము

మోరో—నీవు నాకోర్కి చెల్లించినచో, దేవి సాక్షిగా వేయి నిష్కముల నొసంగెదను.

అందులకు గంగాబాయి తనసమ్మతిని దెలుపుచుఁ దల యూఁపి "న న్నొకనాఁడు వ్యాసశాస్త్రి గుడినుండి తఱిమి వేయించెను. ఆయవమానమునకుఁ బ్రతీకారము గావింపకుండ గంగాబాయి నిదురవోవునే ? నీ కాకళావతి నొసంగితినేని ధనలాభమే కాక శత్రుగర్వపరిహారముకూడ నగును" అని చెప్పి కొంతదనుక నాలోచనానిమగ్నయై మరల మోరో పండితువంకఁ జూచి "నీ కొక సోదరి కలదు గదా ? ఆమెకు నీవేల వివాహము చేయలేదు ?" అని ప్రశ్నించెను.

మోరో—చిన్ననాఁ డామె నొకబాలునకుఁ బ్రధానము గావించితిమి. మొన్న మొన్నటివఱకు నాతఁడు పెండ్లికగు కర్చులు

నయితము భరింపలేనంతటి ధనహీనుఁడై యుండెను. కొన్ని మాసముల క్రిందటనే యాతఁడు పరలోకగతుఁ డాయెను. ఇట్టి కారణములచే నామె కవివాహితగా నుండవలయుట తటస్థించెను.

గంగ—అవివాహితయో, వివాహితయో నే నెఱుంగను గాని కళావతివలె విగతభర్తృక యని మాత్రము దృఢముగాఁ జెప్పఁగలను.

మోహ—(కోపముతో) గంగా! అందఱయెడల నీ విట్టే నిందారోపణలు చేయుచుందువు. నాసోదరియెడల నట్లు చేసినచో సైరింపను సుమా!

గంగా—(నవ్వుచు) సరియే. నీకంతకోప మైనచో నే నాసంగతినిగూర్చి మాటలాడను. కాని, ఆనందాబాయి తనభర్త యగు వ్యాసశాస్త్రికి ద్వితీయవివాహము చేయవలయునని తలంచు చున్న సంగతి నీ వెఱుంగుదువా? అతఁడు కడు ధనవంతుఁడును, మాననీయుఁడునై యున్నాఁడు. అతనికి నీసోదరి నిచ్చి వివాహా మేల చేయరాదు?

మోహ—అతనికిని నాకును స్నేహము లేదు సరిగదా కొన్ని కారణములచే నీసంబంధము జరగునట్లుకూడఁ దోఁచదు. అయినను—

గంగ—అయిన నన నేల? నీ చెల్లెలిని న న్నొకసారి చూడనిమ్ము. ఆమె దృఢమనస్కురా లైనచో వ్యాసశాస్త్రిని చేపట్టునట్లు చేయఁగలను. అట్లయినచో నేను మఱింత ధనవంతురాల నగుదును.

మోరో—మా రాధ, వ్యాసశాస్త్రి కర్ధాంగలక్ష్మి యైనచో నీచేతులకుఁ గనకకంకణములఁ గూడఁ దొడిగెదను.

గంగ—మఱియొకమాట, నీకెవరైన దగ్గరబంధువు లగుస్త్రీలు కలరా?

మోరో—మా జననిసోదరి యగుసుభద్రాబాయి యనునొక వితంతువు కలదు.

గంగ—ఇం కెవ్వరును లేరా?

మోరో—లేరు, మా పూర్వచరిత్రమును తలంచుకొనినచో నాహృదయము భేదించుకొని పోవుచుండును. మా జనకుఁడు విద్యానగరమునం దొక గొప్ప ధనవంతుఁడును, పండితుఁడు నై యుండెను. అతనికి జ్యోతిషమునఁగల పాండిత్య మపారము. మా జనని సౌందర్యవతుల కెల్ల మేటి యని ప్రసిద్ధి. మా దౌర్భాగ్యము వశమునఁ గొన్ని వత్సరముల క్రిందట మా తల్లిదండ్రులు మమ్ము విడిచి స్వర్గస్థులైరి. రాధవివాహ మనివార్యము లయిన యిట్టి యడంకులచే నాఁపివేయఁబడుచున్నది.

గంగ—నేనింకఁ గార్యనిర్వాహణమునకై పోవలయును. నీ వొనరించిన వాగ్దానము మఱువవలదని హెచ్చరించుచున్నాను. మన మిరువుర మొక్కచోటఁ బరులకుఁ గానిపించు టంత శ్రేయస్కరము గాదు. నీ వా మార్గమునఁ బొమ్ము. నే నీదారి నేఁగెదను.

మోరో—గంగా! నారహస్యములు నీకనేకముగఁ దెలిసియే యుండుటచే నేను నిన్ను మోసము చేయఁ జాలను.

నీకార్యమున నీవుండుము. దేవుఁడు నీకు మంచి దినములు కలిగించుఁగాక !

ఇట్లాయిరువురును ప్రసంగించుకొని చెఱియొక మార్గమునను తులజాపురమున కేఁగిరి. మోరోపంతు చిన్ననాఁట నుండియు జ్యోతిషమునం దాసక్తి లేక గానమును బాగుగా నేర్చెను. గీర్వాణభాషయం దాతనికిఁ బాండిత్యము కూడఁ గలదు. కాని యాతఁడు విశేషముగ దుర్గుణములకుఁ బుట్టినిల్లు గులకఱాలలో వజ్రము లుండునట్లే యాతనికిఁగల దుర్గుణజాలములోఁ గార్యదీక్ష యనుసద్గుణ మొకటి కలదు. అతనితండ్రి చిన్ననాఁడే కాలధర్మము నొందుటచే ధూర్తలగు మహారాష్ట్రబాలురతో నతఁడు తిరుగు చుండెడివాఁడు. అట్టి గుంపులకు శివాజీ నాయకుఁడై మెల్లఁగా సేనను సమకూర్చుకొని కొన్నిజయములఁ గాంచెను. అతనికి మోరోపంతు కుడిభుజమై సకలవిధముల సాహాయ్యముఁ జేయుచుండెను.

అనుపమానరూపశాలినియు, దృఢమనస్కయు నైన రాధ చిన్ననాఁటనుండియు శివాజీని ప్రేమించి యుండెను. అతఁడు తఱచుగా మోరోపంతుగృహమునకు వచ్చుచుండెడివాఁడు. ఆసమయముననే వారిరువురకును మోహబంధ మేర్పడెను. ఈ బీజము రానురాను మహావృక్షమై, వేళ్లు పాఱి సుకరముగా నిర్మూలింప శక్యము కానంత బలవత్తర మైనదాయెను. మోరో సుఖియాబాయీ లిది యంతయు నెఱింగియు నీదుష్కార్యమున కడ్డు రారైరి.

ఇట్లుండ శివాజీ యువరాజబిరుదాంకితుఁడై మహారాష్ట్రవీరుల ననేకులను తనపక్షమునకుఁ ద్రిప్పుకొనుచు నప్పు

దప్పుడు తురుష్కులపై సమాంతముగాఁ బడి జయశ్రీని చేకొనుచు గొప్పఖ్యాతిని సంపాదించెను. తాను బ్రాహ్మణేతరుఁడగుటచే బ్రాహ్మణకన్యయగు రాధను పెండ్లాడుట దోష మని మహారాజునకుఁ దట్టెను. అప్పటినుండియుఁ దన ప్రణయవల్లిని దుష్ఫలము నీయకముందే నిర్మూలింప నిశ్చయించి కృతార్థుఁడాయెను. ఈ భావము నెఱుకపఱచుట కాతఁ డాలస్యము చేయుటచే నా బాలిక పదునాఱవ సంవత్సరమువఱకు నవివాహితయై యుండవలసిన దాయెను. ఆమె నొకధనవంతున కిచ్చి పెండ్లి చేయవలయు నని మోరోపంతు తలక్రిందులుఁ దపము గావించుచుండెను.

దేవాలయమునఁ బూర్ణిమనాఁ డొకగొప్ప యుత్సవము జరగుచుండెను. మాళవ, కొంకణ, చోళ, పాండ్య, కోసల, కేకయ, కేరళ, ఘూర్జర, మహారాష్ట్ర, సింధు, కాంభోజ, కాశ్మీర, మగధ, పాంచాల, వంగ, మలయాళ, సింహళాది దేశములనుండి యాత్రికులు గుంపులు గుంపులుగా నచటికి వచ్చిరి. అట్టితరుణములందు వ్యాసశాస్త్రివంటి ముఖ్యమతాచార్యుల స్త్రీజనమునకును, వారివారి స్నేహితులకు నొసంగుటకుఁ గొన్ని పీఠములు విడువఁబడుచుండును.

ఆనాఁడు యాత్రికులకు దేవీదర్శన మగుట కడు దుర్ఘటముగా నుండెను. ఆగుంపులో నుఖయూశాయి కరములఁ గంకణములను, వక్షస్స్థలముపైఁ జంద్రహారాదు లగు నగలను దాల్చి యాలయమునఁ బ్రవేశించెను. ఆయుధపాణు లగు భటు లామెచుట్టును నిలిచి జనసమ్మర్దమునుండి రక్షించుచున్నను ఆమె దేవిని జేరలేక యట్లె నిలువఁబడి[illegible]

ఆనందాబాయికడఁ బరిచర్య సేయుచున్న గంగ యామెం గాంచి సుఖియాబాయి కొకయాసన మిమ్మని కోరెను. సుఖియాబాయి ధనవంతురా లనియు మాననీయమగు కుటుంబమునఁ బుట్టిన దనియు ఆనందాబాయి గ్రహించి యందులకు సమ్మతించెను. ఆ యుత్సవము ముగియులోపుననే వారిరువురును స్నేహిత లైరి.

రాధకు వ్యాసశాస్త్రిని వివాహ మాడుటయం దంత యిష్టము లేకున్నను యువకుఁ డగు భర్త యున్నచో ధన ముండ దనియు, రెండును కలుగుదనుక వేచియున్నచో వివాహోచితమగు వయస్సు దాఁటి సంఘబహిష్కారమునకు గురి యగుదు ననియు నాతనిని పరిణయ మాడుటకు సమ్మతించెను. ఆనందాబాయి తమ్ముఁ జూడవచ్చినప్పుడు ప్రౌఢ చేష్టలు విడిచి ముగ్ధవలె నటించుచుండెను.

కొంతకాల మిట్లు గడపినపిదప సుఖియా ఆనందల మైత్రి దృఢతమమై యొకరిగష్టసుఖంబు లొకరికి విశదీకరించుకొనునంతవఱకును వచ్చెను. ఆనంద కేటులైన రాధను తన సపత్నిగాఁ గైకొనవలె నను బుద్ధి పొడమి తమకుటుంబస్థితి నంతయు సుఖియాబాయికిఁ దెలిపి రాధను తనభర్త కిచ్చి యుద్వాహముఁ జేయు మని కోరెను. అందుల కామె పరమానందభరితురా లై తనయనుమతిని దెలిపెను.

కళావతివైధవ్యమును భవాని తనయధీనమునకుఁ గైకొనినది మొదలు వ్యాసశాస్త్రి నిర్విచారముగాఁ గాలము గడపుచుండెను. ఒకనాఁ డాతఁడు తనభూములపై వచ్చినద్రవ్యాప్తిపట్టికను లెక్కించుచుండ సతీసుత లచటికి వచ్చిరి.

ఆతఁడు వారివంకఁ జూచి "ఈధనము నంతయు నేమి చేయుదము ?" అని నవ్వుచుఁ బ్రశ్నించెను.

ఆనంద:— దీనితో మీకు వివాహము గావింతుము. దైవకృపవలన నొకపుత్త్రుఁ డుదయించినచో మన కథోలోక ప్రాప్తి గలుగదు.

వ్యాసశాస్త్రి:— వలదు - వలదు. వృద్ధునికి పడుచు భార్యయుండుటవలనఁ గలుగుచిక్కులు పెక్కు గలవు ఆ ప్రసంగము నీకేఁ దలపెట్టకుము.

ఆనంద:— నలువదియైదేండ్లకే వార్ధకమా ? మీకంటె వయసునఁ బెద్ద లగువా రెందఱో యింకను వివాహముచేసికొనుచుండుట మన మెఱుంగమా ? ఇప్పుడు మీరు పెండ్లి చేసికొనినచో మనకు వయస్సు మీఱునప్పటికి మనల సంరక్షింప నొకకుమారుఁ డుండును. వానిని మన యాస్తితోఁగూడఁ గాశీవిశ్వనాథునకుసమర్పించిన ధన్యుల మగుదుము.

అని యేమేమియో చెప్పి రాధను చేపట్టుట కాతనిని సమ్మతింపఁ జేసెను. ఆమఱునాఁడు వారిగృహ మతిరమణీయముగ నలంకరింపఁబడెను. ఆనందాబాయి జిలుగుపసిండిచేలము గట్టి నవీనభూషణావళులను ధరించి చేతి నున్నబంగారు పళ్లెరమునందుఁ జక్కెర, కుంకుము, పసుపు మొదలగువానినుంచుకొని మంగళవాద్యములు వెంట రాఁ గళావతితోఁ గలసి విద్యానాథునిగృహమున కరిగెను. ఆనందాకళావతులు రాధచే నూతనవస్త్రముల ధరింపఁజేసి పెండ్లికొమార్తను

గావించిరి. శాస్త్రోక్తముగ రాధను వ్యాసశాస్త్రికిఁ బ్రదానము చేసికొని యానందోత్ఫుల్లనయనములతో గృహమునఁ కేగిరి.

---

## ఏడవ ప్రకరణము.

### అనాఁటి రాజకీయపరిస్థితులు.

ఈకథ జరగినకాలమునందు భారతదేశము పలుచిన్న రాజ్యముల క్రింద విభాగింపఁబడి వెవ్వేఱురాజులచేఁ బాలింపఁబడుచుండెను. ఈ రాజ్యము లన్నిటికిని ఢిల్లీ - బీజపురము లగ్రస్థానమును నహించెను. ధర్మరాజాదులగు ప్రభువులచే నధిష్ఠింపఁబడిన హస్తినాపురసింహాసన మాకాలమున మహమ్మదీయపక్షపాతియగు ఔరంగజీబుచే నాక్రమింపఁబడెను.

అతఁడు 1659-వ సంవత్సరమున "ఆలంగీరు" బిరుదాంకితుఁడై హిందూదేశసార్వభౌముఁ డాయెను. భాగ్యవంతులు సాధారణముగా నభిలషించుచుండెడు మాతని కనిష్టము. స్వజీవనోద్ధరణకై యాతఁడు టోపీలుకుట్టి యమ్ముకొనుచుండెడివాఁడు. శ్వేతవస్త్రధారణమే కాని యమూల్యవస్త్రాలంకారముల నాతఁ డెన్నఁడును ధరింపలేదు. భోగేచ్ఛల నాతఁడు జయించినను స్వమతాభిమానమును, పరమతద్వేషమును ఆతని నంధునిగఁ జేసివైచెను. భారతదేశమున హైందవులు గాని షియాతెగలోఁ జేరిన మహమ్మదీయులు గాని లేకున్నచో నాతనివంటి మంచి పరిపాలకుఁ డీప్రపంచమున లేఁ డని ప్రఖ్యాతిని బడసియుండెడివాఁడు. పాలకుండయందు విడువఁ

బడినవిషబిందువుచందమున నాతనిసద్గుణముల నన్నిటిని పర మతద్వేష మనుగరళకణము నిర్మూలముఁ గావించివై చెను. బీజపురగోల్కొండరాజ్యముల నణఁగఁద్రొక్కుటయు హిందూ మతమును నాశము గావించుటయు నాతని ముఖ్యోద్దేశములు. ...నాథునిదేవాలయము నేలమట్టముగఁ గావించి దానిస్థానమున మసీదు నెలకొల్పెను. హైందవు లీయవలసిన పన్నులలో సగమే మహమ్మదీయు లీయవలసియుండెను. ఇట్టి క్రూరశాసనము లనేకము లాకాలమున వెలసియుండెను. దేశ మిట్టిపరిస్థితులం దల్లాడుచుండ బీజపురపాలకుఁడు మర ణించెను. ఆతనికుమారుఁడగు 'ఆదిల్ షాహా' యను బాలుఁడు రాజ్యాధిపతి యాయెను. ఆ సంస్థానమున హైందవులు కొంద ఱున్నతోద్యోగులుగా నున్నను హిందూమతద్వేష మనుచీడ పురు గీసుల్తానునుగూడ నావహించెను. దుర్గుణములు త్వరలో నలవడును గాని సద్గుణము లబ్బుట కష్టముగదా! ఔరంగ జేబుపరమతద్వేష మీతని కబ్బెనుగాని యాతనిసద్గుణములు మాత్ర మబ్బలేదు.

అందుచే హైందవులకు మహమ్మదీయు లనినఁ గ్రోధము జనించెను. అట్టిసమయమున నా శివాజీ యనుమహారాష్ట్రక్షత్రి యపుంగవుఁడు తురుష్కుల దుర్మార్గవర్తనములఁ జక్కఁజేయ సమకట్టెను. హైందవమహమ్మదీయవిభేద మతని కావంతయు లేదు. 'ఖొరాన్' గ్రంథ మనిన నతనికి మిక్కిలి ప్రీతి. అబల లను వృద్ధులను అతఁ డత్యాదరమునఁ గాంచుచుండెను. న్యాయవంతుల కాతఁడు పట్టుగొమ్మ, దుష్టప్రవర్తనులకుఁ బ్రక్కలోని బల్లెము.

ఆతఁడు షహాజీ యనుజాగీర్దారుని తనయుఁడు. దాదాజీ యను బ్రాహ్మణోత్తముఁ డాతనికి గురువై యతని నస్త్రవిద్య, ఖడ్గప్రయోగము, గుఱ్ఱపుస్వారి మొదలగువానియం దసమాన పండితునిగాఁ జేసెను.

చిన్ననాఁటనుండియు శివాజీ భారతవీరులకథల నాత్రముతో వినుచు వారివలెఁ దానుగూడ బరోపకార పరాయణుఁడు గావలె నని యభిలషించుచుండెను. హిందూమతోద్ధరణమునకై భవాని యాతనిని సృజించె నని పలువురు తలంచుచుండిరి. మతరక్షణమునకై ప్రాణములనైన నర్పింప సిద్ధముగా నున్నకొందఱు మహారాష్ట్రశూరుల నాతఁడు సమకూర్చుకొని మహమ్మదీయసైనికులపై నమాంతముగాఁ బడి వారిసొత్తుల నపహరించి వానిని హిందూరాజ్య స్థాపనమునకు వినియోగించుచుండెను. స్వమతోద్ధరణమునకై యొనరించు నిట్టికార్యములు పాపరహితము లని యాతని నమ్మకము. ఎవ్వరిని గాని యాతఁడు నిష్కారణముగా హింసించి యెఱుఁగడు. బీదలపైఁ నతఁ డనేకపర్యాయములు తననిర్హేతుకకరుణను ప్రసరింపజేసెను. కొలఁదికాలముననే శివాజీసద్గుణమణిదీపులచే దేశ మంతయు నిండిపోయెను. ఆతని శౌరములచే దిక్కులు మాఱుమ్రోఁగుచుండెను. కార్యసాధనకనువగుయుక్తి కాతనిది పెట్టినది పేరు. రాజనీతిశాస్త్ర మాతనికిఁ గరతలామలకమై యుండెను.

మహాబలసంపన్నములగు ఢిల్లీబీజపురముల నెదిరించుట కాతనికిఁ దగినంత సైన్యము లేకుండెను. అందుచే నాతఁడు

'ఆలంగీరు' తోను; 'ఆదిల్‌షాహా' తోను స్నేహముగా నున్నట్లు నటించుచుండెను గాని సమయము చిక్కినపుడు భారతరాజ్యలక్ష్మిని మహమ్మదీయహస్తములయందుండి విడఁదీయ నిశ్చయించుకొనెను. శివాజీ తనవంకకు మహారాష్ట్రుల నందఱను త్రిప్పుకొని కార్యసాఫల్యముకొఱకు మోరోపంతు, తానాజీ, మాల్సురే మొదలగు ముఖ్యారులను పలుతావులకుఁ బంపుచుండెను.

ఔరంగజీబును సాధృశ్యముగాఁ గొని మహమ్మదీయ చక్రవర్తు లందఱు నట్టివారేయని తలంపరాదు. హైందవ మహమ్మదీయులను తన రెండునేత్రములవలెఁ గాంచి భారత దేశము నంతయు నేకచ్ఛత్రాధిపత్యముగా నేలిన "అక్బరు పాదుషా" మహమ్మదీయుఁడు కాఁడా? ఆనాఁటి ప్రజల దుర దృష్టమున, ఔరంగజీబునకుఁ బరమతద్వేషము కలిగి యదియే మహమ్మదీయరాజ్యవిచ్ఛేదమునకుఁ గారణమాయెను. దుష్టు లగు నట్టిపాలకుల నాఁడుకూడ మనదేశ మొకవిధముగా మంచిస్థితియందే యుండె నని చెప్పవలసియున్నది.

మనము బాగుగా యోజించినపక్షమున ఔరంగజీబు నిజముగా భారతీయుడే. ఈదేశమున జన్మించి యిచ్చటనే వివాహ మాడి భారతమాతలో నైక్య మైపోయినవాఁడు భారతీయుఁడు గాక పరుఁ డెట్లగును? అతఁడు నవాబులు చేసినపన్నులన్నియును మనదేశమునందే ఖర్చుపెట్టఁబడెను. అతఁడు సమకూర్చిన సేనయందు సేనానాయకుఁడు మొదలు సిపాయీలవఱకును మనదేశమువారే కాని, అరేబియావారు

కారు. ఆఫ్ఘనిస్థానమందలి కూలీలను రక్షించుటకుగాని విదేశ వాణిజ్యము నుద్ధరించుటకుఁగాని యాతఁడెన్నఁడును స్వదేశ వస్తువులపైనఁ బన్ను విధింపలేదు. కావుననే యాతని రాజ్య మెన్నియో కలవరములకుఁ దావైనంగినను దేశమానందు ధనము సమృద్ధిగా నుండెను.

కాని, ఔరంగజేబుయొక్క పితృపితామహాదులు ప్రజాభిప్రాయము ననుసరించి దేశమును పాలించుటచేతను, హైందవమహమ్మదీయ విభేదము వారికి లేకపోవుటచేతను, సద్గుణ శాలులగునట్టి భూపతుల తరువాత నీతఁడు సింహాసన మెక్కుట చేతను హైందవుల కీతనియం దనాదరణము కలిగెను. కొందఱు మహమ్మదీయు లిదియే సమయ మని 'కాఫర్ల' ననేకవిధ ముల బాధించుచుండెడివారు. అందుచే హైందవ మహమ్మ దీయ ద్వేషము రానురాను ప్రబలఁజొచ్చెను.

బీజపురపుసుల్తాను బాలుఁడగుటచే ఢిల్లీ సార్వభౌముఁ డిదియే సమయ మని యారాజ్యమును స్వాధీనపఱుచుకొన నిశ్చయించుకొనెనుగాని యాపురముదుర్గము శత్రుదుర్భేద్యమై యుండెను. రాజనీతివిశారదుఁడగు పాదుషా మిత్రభేద మే దీనికిఁ దరణోపాయ మని యెఱుంగును గాన తనసేవకుల ననేకుల నారాజ్యమున కంపి రాజోద్యోగులకు లంచము లొసంగి తన పక్షమునకుఁ ద్రిప్పుకొన యత్నించుచుండెను.

## ఎనిమిదవ ప్రకరణము.

### వ్యాసశాస్త్రి వివాహము.

"సీ. ఏ ముత్తెముల్ పద్మినీద్యహ_స్తంబులఁ
బద్మరాగంబుల పగిదినొప్పె
నే ముత్తెముల్ రంగధాముని శిరమునఁ
గుందకుసుంబులై గొమరుమిగిలె
నే ముత్తెముల్ రంగధామునిదోయిట
రాఁగఁ బద్మంబులరహి వహించె
నే ముత్తెముల్ పద్మినీమ_స్తకంబున
వాసవోపలములవన్నెఁ దనరె

తే. నట్టి ముత్యము లుభయకల్యాణసమయ
కరపుటస్థిత శోభనాక్షత సమాజ
యుతములై మేనలర జాజి యొప్పుమిగిలి
పౌరజనులకుఁ గన్నులపండు వయ్యె."

(పద్మినీ పరిణయము)

వీరకిశోర మయినట్టి శివాజీపతుమునకు మహారాష్ట్ర నాయకులను ద్రిప్పుకొనుటకై మోరోపంతు తులజాపురమునకువచ్చి యచటఁ దన సోదరియగు రాధను వ్యాసశాస్త్రికిచ్చి పెండ్లి చేయుటకు నిశ్చయించె నని మన మెఱుంగుదుము గదా! ఈ ప్రధానమైన కొలఁదిదినములకే వివాహముహూర్త మేర్పఱుపఁబడెను.

పట్టణ మంతయుఁ దోరణములతో నిండిపోయెను. వాకిళ్లన్నియుఁ బలువిధములగు రంగవల్లులచే నలంకరింపఁబడెను. పలుచోట్ల శశికాంతవేదికాస్థలము లేర్పఱిచి వానిపై

శృంగార యుతముగాఁ జలువపందిళ్లు వేయించిరి. పెండ్లివారి గృహములు పరిమళవస్తువులచే నిండిపోయెను. మంగళవాద్యములయుఁ, బురోహితాదుల యాశీర్వాదములయుధ్వని నింగినంటుచుండ వ్యాసశాస్త్రి రాధను పరిణయమాడెను. మోరోపం తొకసారి ఫకీరువేషమునను, మఱియొకసారి సంన్యాసి వేషమునను వచ్చి పెండ్లికుమారుని మోసపుచ్చుచు వివాహమున కరుదెంచినవారి నందఱ నానందసముద్రమున నోలలాడించెడివాఁడు. ఆ శుభదినములం దానందాశాయివదనమున దరహాసచంద్రికలు తాండవ మాడుచుండెను. అతిథుల కించుకేనియు లోపము రాకుండునట్లు వేయికన్నులతోఁ గాంచుచు నూతన కాంచనాంబరములను సుగంధతాంబూలాదులను వారి కర్పించి గౌరవించిన దామెయే ఇట్లు రాధా వ్యాసశాస్త్రుల వివాహ మతి జయప్రదముగా జరిగినపిదప మోరోపంతు సఖియాబాయిలు వారియింటనే కొన్నిదినములుండిరి. ఆకాలమున మోరోపంతు వ్యాసశాస్త్రితోఁ దర్కము మున్నగు శాస్త్రములందుఁ జర్చలఁ గావించుచు సంభాషణ వశంబున శివాజీయుద్దేశములు కొన్ని యతని కెఱిఁగించెను.

వ్యాసశాస్త్రి బీజపురరాజ్యమునందు నివసించువాఁడగుటయే కాక కొన్ని రాజకీయ విషయములందు సుల్తానునకు సాహాయ్యము చేయువాఁ డగుటచే, శివాజీ కార్యమందు విస్తారముగాఁ బాల్గొనకుండెను. కాని యాతఁడు మోరోపంతునకుఁ బలువురు మహారాష్ట్ర నాయకులతోడఁ బరిచయమును గలుగునటులు వారి కనేక లేఖల వ్రాసెను. మోరోపం తట్లు

కొంతకాలము గడపినపిదప సుఖియాబాయిని స్వగృహమున కంపివైచి తాను సంచారమునకై పయనమాయెను.

ఆనాఁటిరాత్రి యాతఁడు తనసోదరిగదిలోనికిఁ బోయి యామె నొకసారి రమ్మని కబురంపెను. రాధ కాతనియందు భ్రాతృవాత్సల్యము గలదు గాని యప్పుడప్పు డాతఁ డనిన నామెకూడ భయపడుచుండును. ఆనాఁడు వారిరువురు నీక్రింది విధమున సంభాషించుకొనిరి.

మోహ°—సోదరీ! నీ వివాహమునకు నేను విశ్వప్రయత్నము లొనరించితి నని నీ వెఱుంగుదువు కదా! నాకష్టమునకు నీ వేమి బహుమాన మొసంగెదవు? (అని నవ్వుచుఁ బ్రశ్నించెను.)

రాధ—త్రిలోకపూజ్యమగు సోదరప్రేమ! (అని నవ్వుచుఁ బ్రత్యుత్తర మిచ్చెను.)

మోహ°—అయినచో నే నేది కోరిన నది యొనరించెద నన్న మాటయే కాదా?

రాధ—నేను జేయఁగలిగినచోఁ దప్పక ప్రయత్నించెదను.

మోహ°—నాకుఁ గళావతి యన్నఁ బట్టరాని మోహ ముదయించినది. ఆమె నన్నుఁ బ్రేమించునట్లు చేయు భారము నీయం దున్నది. ఈ కార్యముఁ జేయుటకు మఱియెవ్వరికిని సాధ్యము గాదు. నీ సాహాయ్యమునఁ నేను దానిని బడయఁదలఁచితిని.

రాధ—ఈపని యసాధ్య మని తలంతును. ఇట్టి పాపపుఁ బని నేల తలపెట్టితివి? కళావతి కిహలోకేచ్ఛలు లేవు.

అదియునుంగాక నీమాట తలఁచిన నామె భయంపడు చుండును. అట్టియెడ నిన్నామె యెట్లు ప్రేమించును ?

మోరో—దానినిఁ బడయకున్నచో నేను జీవింపఁజాలను. నీవు నన్నాలేమ ప్రేమించునట్లుచేయఁజాలనిచో బలవంతమునన్నైన నేను దానిని గొంపోవుదును. శివాజీ కీసంగతి తెలిసినచో నాకుఁ దప్పక మరణశిక్ష విధించును. కాని నే నట్లు చేయక యుండఁజాలను. ఇట్టి యుపద్రవములు కలుగకుండఁ జేయుట నీకుమాత్రమే సాధ్య మగును. అందుచే నీ వాభామతో నన్నుఁగూర్చి చెప్పుము. దాని మనమున మోహబీజమును నాటుము.

రాధ—(సాలోచనము) సారవంత మైనప్రదేశ మైనచోఁగదా మొలక మొలచుట! రాతినేలపై మొక్క మొలచునా?

మోరో—ఆరాతిపై నీవు సారవంత మగుమట్టి పోయుము.

(అంతలో ఆనందాబాయి రాధా ! రాధా ! యని పిలుచుచుండెను.)

రాధ—అన్నా ! నే నింకఁ బోవవలయును, నాశక్తివంచన లేక ప్రయత్నించెదను. నాస్థితి యిప్పుడు ముందరకుఁ బోయిన నూయి, వెనుకకుఁ బోయిన గోయివలె నున్నది. ఇంక నీ వేఁగుము. నీకు శుభ మగుఁగాక !

అని రాధ లోని కేఁగెను. మోరోపంతు, సోదరి తన యీప్సితసిద్ధికై సర్వప్రయత్నములును గావించు నని యెంచి యుండుటచే నామె నింగేమియు బాధింపక గంగాబాయి

గృహమున కరిగెను. అచట నామె యాతనికై కొంతకాలము వేచియుండి యప్పుడే పాన్పుపై నొరగెను. మోరోపం తాగృహము ప్రవేశించి గంగాబాయి కన్నులు మూసియుండుటఁ గాంచి యామెను చంపివేసినచోఁ దనరహస్యము లెవ్వరికిని తెలియరా, వని యొరనుండి కత్తిని దీసెను. ఆసమయముననే రెండుమార్జాలము లఱచుచుఁ బోరాడ మొదలిడెను. ఆశబ్దమున కాకాంత మేల్కొని కన్నులు దెఱచి చండశాసనుని వలె ఖడ్గహస్తుఁడై యున్న మోరోపంతునుజూచి నిశ్చేష్టితయై నిలువఁబడెను. అంత నాతఁడు చిఱునవ్వు నవ్వుచు "గంగా! నీకు బహుమాన మొసంగుట కీవస్తువులను దెచ్చితిని" అని తన జేబునుండి యొకపొట్లమును దీసి దాని త్రాళ్లను కత్తితోఁ గోసివైచెను.

గంగ—(కంపితస్వరముతో) "అట్లయిన నీకృపాణ మేల?"

మోరో—"దీనికిఁ గట్టఁబడిన దారములను ఛేదించి నీచేతికీ కంకణములఁ దొడుగుటకు." అని చెప్పి యామె హస్తములకు వానిని దగిలించి యాయింటివాకిటఁ గట్టఁబడి యున్న తనయశ్వము నెక్కి వెడలిపోయెను.

# ద్వితీయ ఖండము.

## మొదటి ప్రకరణము.

### చోరులు.

దట్టముగ మేఘము లాకసమునఁ గ్రమ్మి గర్జా ఘోషములు గావించుచుండెను. జగ మంధకారపూరిత మైపోయెను. అప్పుడప్పుడు కన్నులు మిఱుమిట్లు గొలుపునట్లు తటిల్లతలు మెఱయుచుఁ బథికులకు మార్గమును సూచించు చుండెను. బీజపురరాజ్యమునకు రాఁబోవుదురవస్థం దలంచి యంబరవాణి శోకించుచున్నదో యనునటులు బోరున వర్షము కురియ నారంభించెను. జల్లు నల్గడలఁ జుట్టి గూండ్లలో నిదురించుచున్న విహంగములను సయితము మేల్కొలుపుచుండెను. సారసాకరములును, కూలంకషోదక ప్రవాహములును వర్షాగమన కారణమునఁ దరంగసంకులము లాయెను. నదీనదములపై మీనమకరములు వెన్ను గనుపడకుండఁ బరుగిడుచుండెను. కేకిజాలములు కేకలు వేయుచుఁ బింఛము లెత్తి చూపఱకు నయనానందము గలుగునటులు నృత్యముఁ జేయుచుండెను.

బీజపురరాజ్యమున "కుల్యాని, విజయపురము"లను రెండునగరములు గలవు. కుల్యానికొక మైలుదూరమునఁ గల్యాణపుర మను చిన్నపల్లె కలదు. ఆపల్లెకును విజయపురమునకును నడుమ నొకచిన్నగుట్టయు, దానిపైని పాడుపడిన యొక

దేవాలయమును కలవు. వర్షము విస్తారముగాఁ గురియు చున్నను, ఆయాలయముపై నొక పురుషుఁడొకముతుకకంబళముచే దేహ మంతయుఁ గప్పికొని యప్పుడప్పుడు తనచేత నున్న దొంగలాంతరుచే నా గుట్టక్రింద నున్నమార్గముపై దీపకాంతులు ప్రసరింపఁజేయుచు నిలిచియుండెను.

ఆతని దేహము కాంచనకాంతిసమన్వితము. భుజములు సమున్నతములు. వదనము ధైర్యోద్దీపితము. బాహువులు దీర్ఘములు. వక్షము మేరుతటసమానము. కర్ణములు శ్రీకారములే. గళము శంఖము. కౌను సింహమధ్యము. ఊరువులు రంభాస్తంభములు. నయనములు భీషణాగ్ని స్ఫులింగములు. పలుమాట లేల? లోచనములయందలి కఠినభావమును తీసివైచినచో నాతనిరూపము మన్మథుని మఱపింపఁజాలును.

క్షణక్షణమును వానజల్లెక్కువ కాఁజొచ్చెను. అంత నాతఁడు గుడిలోనికిఁ బోయి తనయనుచరులగు రామలక్ష్మణులఁ గలసికొనెను. 'బాబూన్' మర్కటదేహములఁ బోలు వారి శరీరములపైన దట్టమగు కంబళములు గప్పఁబడియుండెను. వారి దృఢహస్తములందుఁ గరవాలములు మెఱయు చుండెను. ఆభృత్యసోదరు లాయభినవమన్మథునిం గాంచిన తోడనే నిలువఁబడి "జమాదార్! ఆతఁడు వచ్చినాఁడా?" అని ప్రశ్నించిరి.

జమా—లేదు కల్యాని, కల్యాణపురములమధ్య నున్న మహానదిశాఖలోనికి జలము పూర్ణముగా వచ్చినచో నాతఁడు కల్యాణపురమును చేరఁజాలఁడు.

రాము—మీ రానతిచ్చిన ట్లాతఁడు నేఁటిరాత్రి యెనిమిది గంటలకు గుల్బ్యానినుండి బయలుదేఱినచో నఱగంటకుఁ గల్యాణపురమును జేరియుండును. ఈ రాత్రి పండ్రెండు గంటలవఱకు నదిలోనికి నీరు రాఁజాలదు గావున నాతని ప్రయాణమున కేమాటంకమును గలుగదు.

జమా—వానియొద్ద నేను జూచిన బంగారు మొహరు లెప్పుడు మనయధీన మగునా యని నామనము తత్తఱపడుచున్నది.

రామ & లక్ష్మ—(అత్యాతురతతో) బంగారు మొహరులా ?

జమా—రాజముద్రలచే నొప్పుచున్న చక్కని మొహరులు

లక్ష్మ—అట్లయినచో మన మెన్నికష్టముల నైనను వహించి వానిని మనయధీనము గావించుకొనవలెను.

జమా—ఆ వానకు నీవు శరీరసౌఖ్యమును బలి యొసఁగఁ గలవా ?

లక్ష్మ—ధనము మనయధీన మగుననునాశ యున్నచో నెన్ని కష్టము లైనను సంతోషముతో ననుభవింతును.

జమా—ధన మనిన ధనమా ? మూఁడువేలు మొహరులకుఁ దక్కువ యుండ దని నానమ్మకము.

రామ & లక్ష్మణ — (ఆశ్చర్యముతో) అంతధనమా? అట్లయినచో మే మిప్పుడే వానిని వెదకెదము.

జమా—మీ రిరువురును పోవ నవసరము లేదు. లక్ష్మణా! నీ వీ వర్షములోఁ బ్రయాణము చేయఁగలవా ?

లక్ష్మ—తమయాజ్ఞ యైనచో నిప్పుడే పోయెదను.

జమా—సరియే నీ వీకంబళమును శరీరము నిండఁ గప్పికొని కల్యాణపురమునకుఁ బొమ్ము. అచటి కాతఁడు వచ్చినచో

నీ వాతనికి మార్గదర్శివై యీమార్గమునఁ దీసికొనిరమ్ము. అతఁ డట్లు రాకున్నచో వచ్చినదనుక నీ వచ్చటనే యుండుము. ఆపథికుని మనవారినుండి రక్షింపఁ దలంచినచోఁ దత్పురవాసులవైనఁ గష్టపరంపరలు తటస్థించు నని నామాటగా పటేలుతోఁ జెప్పుము.

లక్ష్మణుఁ డాతనియాజ్ఞను శిరసావహించి యావర్షపాతమును భేదించుకొనుచుఁ గల్యాణపురోన్ముఖుఁడై నడచెను.

---

## రెండవ ప్రకరణము.

### తులసీదాసు పట్టువడుట.

కల్యాణి నగరసత్రమున కెదుట నిరువురు పురుషులు సంభాషించుకొనుచుండిరి. అం దొకఁ డతిథియు రెండవవాఁడు సత్రాధికారియు నై యుండెను. ప్రథమయువకుని రూపమున వీరపురుషచిహ్నము లించుకేనియుఁ గానిపించకున్నను, అతని దట్టియం దొకనిశితకరవాల మమరియుండెను. ద్వితీయపురుషుఁడు వృద్ధుఁ డగునొకబ్రాహ్మణుఁడు. అతని దక్షిణహస్తమున రుద్రాక్షమాల యొకటి వ్రేలాడుచుండెను. వా రిరువురు నీ క్రిందివిధమున మాటలాడుకొనుచుండిరి:—

సత్రాధికారి—మిత్రమా! నీ విపు డొనరింపఁబోవు ప్రయాణ మతికష్టమైనది. ఆ మార్గమునఁ జోరనాయకుఁడగు పహార్ సిం గనువాని సైనికులు దిరుగుచుందురు. వారి కంటఁ బడి ధన, ప్రాణముల దక్కించుకొనఁ గలిగినవా రరుదు. నీవు కల్యాణపురమునకేఁగినపిదప నచటనుండి దక్షిణ

మార్గమును బట్టి పొమ్ము. పాడు దేవాలయపు మార్గమునఁ బోయితివేని నీకుఁ దప్పక ముప్పు వాటిల్లును. ఆయాలయమును గాని, దాని ప్రాంతమున నున్న మఱ్ఱివృక్షమును గాని తలంచినప్పుడు నాప్రాణములు నిలువున నెగిరిపోవును. అదియే దొంగలకు విశ్రమస్థానము.

పథికుఁడు—నీవు చెప్పినమార్గమునఁ బోయినచో విజయపుర మీరాత్రికిఁ చేరఁ గలుగుదుమా ? నా ప్రయాణ మాలస్య మైనచో నాయాశయము లన్నియు భగ్నము లై పోవును.

సత్రా—నేను సూచించిన దక్షిణ మార్గము చుట్టుదారియే యైనను నిరపాయ మైనది. చేరువ యని గుడిమార్గమునఁ బోయినచో నీగుఱ్ఱ మెంతవడిగాఁ బోయినను వర్ష మెక్కు వగ గురియుచుండుటచే నీకు జోరులబారినుండి తప్పించు కొనుట దుర్ఘటము.

పథి—నీవు నాయెడల దయఁ బూని యింతవఱకుపదేశించి నందుల కెంతయుఁ గృతజ్ఞుఁడను. నా కింక సెల విమ్ము.

అని వందన మొనర్చి తనమార్గదర్శి పట్టుకొనియున్న వారువము నెక్కి వెడలిపోయెను.

ఇఁకఁ గల్యాణపురమున జరుగుచున్న విషయములు మన మరయవలయును. అంతకంతకు వానజ లెక్కు వగుచుండెను. హ్రస్వరూపుఁడును దృఢకాయుఁడును నగువాఁ డొకఁ డావర్షములోఁ గల్యాణపురమార్గమునఁ బోవుచు గ్రామపుఁ జావడిలోని కేఁగెను. గ్రామాధికారియగు పటేలాతనిం గాంచి నంతనే యాసనము డిగ్గి యెదురేఁగి గౌరవార్హమగు పీఠము

పైఁ గూర్చుండఁ జేసెను. అన్యోన్యకుశలప్రశ్నానంతర మా నూతన పురుషుఁడు పటేలుని గాంచి "మీపురమునకుఁ గల్యానినుండి యెవ్వఁడైన బాటసారి వచ్చినాఁడా ?" యని ప్రశ్నించెను.

పటేలు—లేదు. ఎవ్వఁడును రాలేదు. నీవు మిక్కిలి యలసి నట్లు గానిపించుచున్నాఁడవు. నాపుత్త్రుని వెంటఁ బోయి మా యింట భోజనము చేసి రమ్ము.

నూతనపురుషుఁడు—సరియే కాని మీ రాయాత్త్రికుని నా దృష్టిపథమునుండి తప్పించితిరేని మీమాన, ధన, ప్రాణ ములు మీవి కావని మా జమాదారు చెప్పుమనెను.

పటేలు—లక్ష్మణా ! నిన్ను మే మెన్నఁటికిని మోసము చేయు వారము కాము. నీవు నిర్విచారముగాఁ బోయి భుజిం పుము. కల్యానినుండి యెవ్వఁడైన వచ్చినచో నీకు వార్త నంపెదను.

ఈ మాట లాలించి లక్ష్మణుఁడు పటేలు కుమారుని వెంట భోజనశాల కేఁగెను. అతఁ డట్లు పోయినమఱి పదిపదు నైదు నిమిషముల కొకయాత్త్రికుఁ డాగ్రామమున కరుగు దెంచెను. పటే లాతనిని జూచినతోడనే దగ్గఱనున్న భటుని చెవిలో నేమియో చెప్పి, యాగంతుకునితో మాటలాడు చుండెను.

అంతట లక్ష్మణుఁ డా స్థానమునకు వచ్చి నూతనపురు షునివంకఁ దిరిగి "అయ్యా ! తమ రెవ్వరు ? తమ రక్ష ముననుండి దిగకుండుట చూడ నీవర్షముననే మరలఁ బ్రయాణ మొనర్పఁ దలంచినటు లున్నారు." అని పలుకరించెను.

ఆగంతుకుఁడు—మా దేయూరైన నేమి? నే నీరేయి విజయపురమున కేఁగవలయును. నీవు నాకు మార్గదర్శివై యుండుటకు సమ్మతించినచోఁ బదిరూప్యము లొసంగెదను.

లక్ష్మణుఁడు—తమబోఁటివారియాజ్ఞ మీఱుట మేర గాదు. నా కీదారు లన్నియు బాగుగఁ దెలియును. దగ్గఱమార్గమున మి మ్మతిత్వరితముగ గమ్యస్థానముఁ జేర్పఁగలను.

ఆగంతుకుఁడు—మనము ప్రాచీన దేవాలయపు మార్గమును విసర్జింపవలయును. కుల్యానిపుర సత్రాధికారి యావంకకుఁ బోయినవారు చోరులచేతులం బడుదు రని నొక్కి చెప్పి యుండెను. విజయపురమునకుఁ బోవు దక్షిణమార్గమును నీ వెఱుంగుదువా?

లక్ష్మణుఁడు—ఎఱుంగుదును. కాని మనము దక్షిణమార్గమున బోతి మేని రెండుమూఁడు దినములదనుక నిర్ణీతస్థానమును జేరఁ జాలము. అదియునుగాక పహార్ సింగు తనసేనలఁ గూడి బీజపురమువంకకుఁ బోవుచుండ నిన్న చూచితిని. కావున మనల నడ్డగించువా రెవ్వరు నీప్రాంతమున లే రనుట నిశ్చయము. కావున మన మీదగ్గఱ దారిని బోవుటయే యుత్తమము. అటుపైనఁ దమయిష్టము.

ఆగంతుకుఁడు—సరియే. నీ యిచ్ఛకు వచ్చినమార్గముననే నన్నుఁ గొనిపొమ్ము.

అని చెప్పెను. లక్ష్మణుఁ డందులకు వల్లె యని యాపథికునకు మార్గదర్శి యయ్యెను. ఇట్లు వా రిరువురు నంధకారమయ మగునా బాటను మినుకుమినుకు మనునక్షత్రకాంతులచేఁ దెలిసికొనుచు వాయువేగమునఁ బోవుచుండిరి. ఇట్లా

కటిరియునఱగంట కాలము పయన మొనర్చిన పిదప వారి కొక చిన్నగుట్ట కానిపించెను. దానిపై నొకపురాతన దేవాలయ మున్నటులు పొడకట్టుచుండెను. పాప! మానిశాసమయమున వర్షపాతభరము నైనఁ దలంపక లేనిధైర్యమును దెచ్చికొనుచు నెట్లో బాటసారి యేఁగుచుండ, దృఢకాయుఁడగు నొకపురు షుఁడు తనదక్షిణ హస్తముచే నాతనికుడిచేతిని గట్టిగాఁ బట్టు కొనెను. అంతట లక్ష్మణుఁడు తులసీదానునిగుఱ్ఱము నాఁపి వైచెను. "అయ్యా! తమనామ మెయ్యది? తమ రెచటికిఁ బోవుచుంటిరి?" అని యాదృఢకాయుఁడు ప్రశ్నించెను. బాట సారి మొదటఁ గళవళపాటు నొంది తనహస్తమును విడిపించు కొన యత్నించెను గాని సాధ్యము కాలేదు. ఎట్టకేల కాఁతఁడు తనమనసును పదిలపఱచుకొని "నన్ను - తులసీ - దా - సం దురు - విజయ - పుర - మునకుఁ - బోవు - చున్నాను - తమ - రెవరు?" అని యడిగెను. అంతట నాతఁడు "నన్ను గోపాలసిం గందురు. ఈప్రాంతభూముల నేకచ్ఛత్రాధిపత్య ముగా నేలుచున్న పహాడ్ సింగుపేరు నీ వాలించియే యుందువు. ఆతఁడు నాకుఁ బినతండ్రియు నాయకుఁడునై యున్నాఁడు.

ఈ మాటలు తులసీదాసుని చెవులఁ బడినంతనే యాతఁ డు నిర్విణ్ణుఁడై పోయెను. నోటఁ దడియారెను. హస్తములు వడఁకఁ జొచ్చెను. రూపము నిర్జీవప్రతిమవలె స్తంభించెను.

గోపాలసిం గాతనిఖడ్గమును లాగివైచి రామలక్ష్మణుల సాయమున నాతనిని గుఱ్ఱమున నుండి దింపివైచి తా నధి రోహించెను. తులసీదాను తురగముననుండి దిగుట కిష్టపడక యొంతగనో పెనఁగులాడెను గాని బలవంతులగు నువ్వురుపీరుల

ముం దాతనియూటలు సాగివచ్చునా ? వా రాతనిని వటవృక్షచ్ఛాయకుఁ గొంపోయిరి. ఆ రంగము ధీరులనుసయితము భీగులను జేయఁజాలియుండఁ దులసీదాసుమాట వేఱ చెప్ప నేల ?

ఆ చెట్టుమొదలు రమారమి ముప్పదినలువది గజములు చుట్టుకొలత గలిగి యుండెను. దానిశాఖలనుండి వ్రేలాడు నూడలు భూమిలోనికిఁ బాతుకొనిపోయి వేర్వేఱువృక్షస్కంధములో యనునటు లుండెను. అది వసంతసమయ మగుటం జేసి యాభూరిభూజము లేఁతయాకులతోను,చిగుళ్లతోను పొల్పొగుచుండెను. వర్ష మతివిస్తారముగాఁ గురియుచున్నను, ఆ వృక్షమును శరణందిన పశు పక్ష్యాదులపైని టక్కున నొక్కచినుకైనను బడుచుండుట లేదు. చెట్టునుండి రాలినయెండుటాకులు భూమిపైన వనలక్ష్మిచేఁ బఱవఁబడినతివాసీయో యనునటు లొప్పుచుండెను. బాటసారులసందడి విని సృగాలాదిజంతువులు కూఁతలు పెట్టుచుఁ బరుగిడుచుండుట చూడఁ దులసీదాసునకు రాఁబోవు దుస్స్థితిని సూచించు చున్నవో యనునటు లుండెను. రామ లక్ష్మణ గోపాలసింగు లీతని నా చెట్టునకుఁ గట్టివైచి యచట వా రంతకుఁ బూర్వమే దాఁచుకొనిన భోజనపదార్థముల నారగించి మరలఁ దమపయనమును సాగింప మొదలిడిరి.

---

## మూఁడవ ప్రకరణము.

ఇన్నూఱుగురాశ్వికులు చోరపురిమునంకకు వడివడిగాఁ బోవుచుండిరి. వారికరవాలములపై రక్తము పూఁత పెట్టినట్టు లుండెను. సైనికులలో ననేకులు మిక్కిలి యలసిపోయిరి.

గుఱ్ఱములపై వృక్షశాఖలతో నిర్మింపఁబడిన పాఁడాలలో గాయపడినవీరులు పడియుండిరి. పురద్వారములను వీక్షించి నంతనే సైనికులమనములం దానందము వెల్లివిరిసెను.

హయహేషలు నింగి ముట్టెను. వీరిరాకను గాంచి చోరంపురపౌరులు జయజయధ్వానములు సేయుచు వారి కెదురుపోయి స్వాగత మొసగిరి. ఆగంతుకులు తిన్నగ రాజ ప్రాసాదమును ప్రవేశించిరి. దస్యునాయకుఁడగు పహార్‌సిం గాలోచనాసూచకనయనములతో, వక్షస్స్థలముపై పిచ్చల విడిగాఁ బడుచున్న బూడిదరంగుగల పెద్దగడ్డముతో విచార గ్రస్తుఁడై దర్శనగృహమునఁ గూరుచుండెను.

అంతట గుఱ్ఱముల టకటకధ్వను లాఁగిపోయెను. గుఱ్ఱపు దళమునాయకుఁడును, పహార్‌సింగు దాయాదుఁడు నగుమానసిం హుఁడు పహార్‌సింగును చేరఁబోవుచుండెను. అతఁ డింకను గూర్చుండకముందే దస్యులసర్దా రాతనివంకకుఁ దిరిగి "మాన సింహా! నీలేఖ నాకందినది. గోపాలసింగు నొంటరిగా నీ వేల విడిచితివి ? వాని కేదేని యాపద తటస్థించినచో నీతప్పును సైరింపనుసుమా." అనియెను.

మానసింహుఁడు—పహార్‌సింగుమహారాజా ! మనగోపాలున కేమియు భయము లేదు మేము నిన్న గొల్ల గొనినధన మిరువదివేలకు మించి యుండు నని తోఁచుచున్నది. మన పక్షమువారు కొలఁదిమందిమాత్రమే గాయపడిరి.

పహార్—సరియే ! అన్నియు బాగుగనే యున్నవి. కాని బాలు నొంటరిగా నీ వేల పోనిచ్చితివి ?

మానసింహుఁడు—కల్యాణియందలి కోశీదారుకడఁ గొన్ని హుండీలను మార్చుకొని రమ్మని గోపాలు నంపితిని. అక్కడనుండి మరలి వచ్చినపుడు నాకేమియు విశేషములు దెలుపలేదు. మఱుచటిదిన ముదయమున కాతఁడు గుడారమున లేఁడు కాని, రామలక్ష్మణుల సాహాయ్యము గొని కాలినడకను కార్యార్థము పోయితి ననియుఁ, దన వెనుక నెవ్వరిని పంపవల దనియును ద్వారరక్షకునితోఁ జెప్పిపోయి నటులు తెలియవచ్చెను. జేయున దేమియు లేక తమ కొఱ జాబు నంపి మేము మెల్లఁగా నిటకు వచ్చితిమి.

పహర్—ముక్కుపచ్చ లైనను సమముగా నారని బాలకు నసహాయునిగాఁ బోవనిచ్చిన నీ బోఁటిమూర్ఖుఁడు జన్మించి యుండకపోవుటయే యుత్తమము.

మానసింహుఁడు—మహాప్రభూ! నన్నారక దూషించి నందువలనఁ బ్రయోజన మించు కేనియు లేదు. ఆతఁడు నిరపాయముగా నిలు సేరఁ గలఁడని నే నెఱుంగుదును. కాని తమయాజ్ఞ యైనచో నేను మఱియొక యశ్వము నెక్కి పోయి గోపాలుని వెదకి తెచ్చెదను.

పహర్—నీ వేమియుఁ జేయ నక్కఱలేదు. మఱికొంత సేపు చూచి నేనే తగు నేర్పాట్లు చేసెదను. నీవు గృహమున కేఁగి విశ్రమింపుము.

మాన—మేము దోచికొని తెచ్చిన సంచులలో నెంత ధనమున్నదో తమరు పరీక్షింపఁ గోరెదను.

పహర్—సరియే - వానిని గొనిరండు—

పిమ్మట నిరువురు సేవకులు కొన్నిసంచులను గొని వచ్చి పహార్‌సింగుముందు గుమ్మరించిరి. అతఁ డత్యాతురతతో నాబంగారునాణెములను లెక్కించుచుండఁగా, "ఢా" మ్మనుశబ్ద మొకటి వినవచ్చెను. ఆశబ్దముమాహాత్మ్య మెట్టిదో కాని చోరనాయకునిముఖమునం దానందచిహ్నము లుదయించెను. "గోపాలుఁడు వచ్చుచున్నాఁడు. పైయంతస్తునందలి సాంకేతిక దీపమును వెలిఁగించుఁడు" అనుమాట లాతని నోటనుండి యప్రయత్నముగా వెలువడెను. మానసింహుఁడది యంతయుఁ గనిపట్టి "మహారాజా! మనగోపాలసింగు నిరపాయముగా వచ్చు నని నేను జెప్పలేదా ?" అనియెను.

పహార్ — సోదరా మానసింహా! చిన్ననాఁటనుండియు నాచేతులలోఁ బెరిఁగిన గోపాలుఁడు వచ్చునో, రాఁడో యను సందేహముచే నిన్నైనఁ దూల నాడినచో నన్ను మన్నింపుము.

మాన — అగ్రజు లొసంగిన దూషణ భూషణముల ననుజులు భక్తిశ్రద్ధలతో స్వీకరింప వలయునుగదా !

అని మానసింహుఁడు నవ్వుచుఁ బలికెను. అంతట గోపాలసిం గాతావునకు వచ్చెను. దస్యునాయకుఁ డాతనిని కౌఁగిలించుకొనిమూర్ధమాఘ్రాణించితనప్రక్కను కూర్చుండ బెట్టికొనెను. గోపాలుఁడు తాను కుల్యానికిఁ బోయిన దాది చోరపురము ప్రవేశించువఱకును జరగిన యావద్వృత్తాంతమును విపులముగా వారలకుఁ దెలిపెను. పహార్‌సింహుఁ డది యంతయు శ్రద్ధతో నాలకించి బందీ యగుతులసీదాసును తన యెదుటికిఁ గొనిర మ్మని యాజ్ఞాపించెను. వ్రేలాడుచున్న

ముఖముతో, బాష్పధారలచేఁ దడిసిన కపోలములతో, భయముచేఁ గంపించుచున్న దేహముతోఁ జలించుచున్న నేత్రములతోఁ, బాపమాబందీ గొనిరాఁబడెను. గోపాలసింహుఁడాతనిని బట్టి తీసికొనివచ్చునపుడు మార్గమధ్యమున నాతఁడెన్నియో పారసీకకవివాక్యముల నుదాహరించి వానిచేఁ జోరనాయకుని మెప్పింప నెంచెను.

ఇపు డాతనినోటనుండి మాట రాదాయెను. ప్రయత్నపూర్వకముగా నేదేని యుచ్చరింపఁ దలంచినను స్వరము కంపింప మొదలిడెను. "కరుణింపుఁడు, కరుణింపుడు," అను మాటలే కాని మఱియేవియు నాతఁడు పలుకఁజాలకుండెను. ఆతని దౌర్భాగ్యావస్థ నూహింప వలసినదే కాని వ్రాయ నలవి గాదు.

పహార్ సింగు మేఘగంభీరస్వరముతో. "నీ కథ నంతయు మాకు సవిస్తరముగా నెఱిఁగింపుము" అని తులసీదాను వంకఁ దిరిగి పలికెను. దానుహృదయము పిడుగుపడినట్లాయెను. కొంతసేపటికి ధైర్యమును చిక్కఁబట్టి మార్గమధ్యమునఁ దాను కల్పించిన యొకకథ నీవిధముగాఁ జెప్పఁదొడంగెను.

"ప్రభూత్తమా! నే నొక ఢిల్లీవర్తకుఁడను. నిన్నను కల్యాణివర్తకులతోఁ గొన్ని వ్యవహారములను పరిచేసికొని బీజపురమునకుఁ బోవుచు మార్గమధ్యమునఁ దమవారలచేఁ బట్టువడితిని. నన్నెటులైనను దమరు దయదలఁచి విడిపించెద రని నమ్ముచున్నాఁడను."

గోపాల—మూర్ఖుఁడా! త్రాఁచుఁబాముతో సయ్యాట లాడఁ దలంచుచున్నావా? కల్యాణినగరమున గోసాయీలకడ

నీవు కొన్ని హుండీలను మార్చితివి. అంతకన్న నీసంగతి వారెక్కువ యెఱుంగరు. ఈ సారి మహారాజుగారియెదుట గల్లలాడ యత్నించితివేని నీప్రాణములు నీకు దక్క వనుట నిశ్చయము. ఇఁకనైనను నిజము చెప్పుము.

పహద్—అరే! అసత్యప్రలాపప్రవీణా! నీఁబోటి యసత్య వాదియొద్ద సత్యమును గ్రహించుటకు మాకనేక సాధనములు గలవు. రామలక్ష్మణులారా! మానెగుడ్డలను వీని చేతులకుఁ గట్టి యంటించుఁడు.

రామలక్ష్మణులు నూనెలో ముంచిన కొన్ని గుడ్డలను తులసీదాసుని హస్తములకుఁ జుట్టిరి. తనకు రానున్న దురవస్థ నొక్కసారి యాతఁడు గ్రహించి, శోకప్రవాహమునఁ గొన్ని మాటలు కొట్టుకొనిపోవ, నీక్రిందివిధమునఁ జెప్పఁదొడంగెను. "మహా - రాజా! - కరుణింపుడు - నిజము - చెప్పె - దను. నన్ను - దహిం - పకుఁడు - ఈ - కట్లు - విప్పి - వేయుఁడు—

పహర్—నీవు సత్యము పలుకఁ దలంచితివేని త్వరగనే చెప్పుము. నీహస్తములు కాగడా లైనపిదప విచారించిన లాభకరము లేదు. నిక్కము నచింపితివేని నీ ప్రాణముల కేయుపాయమును గల్గింపము.

తులసీ—తమ భవ్యవాక్సుధాధారలచే నాప్రాణము లిప్పుడు కుదుటఁబడినవి.

రాముఁడు—ఈసారి కల్ల లాడితివా తప్పక యమునిపీటి కంపఁబడుదువు.

తులసీ—విపత్సముద్రమున దరిగానక యీదుచున్నపుడు దొరకిననావ నవఁగైనను భగ్న మొనరించుకొనునా? నేను

జెప్పఁబోవు రహస్యవిషయములను తమరు తప్ప నొరులు వినరాదు. కొలఁదినిముసములు నాకుఁ దమతో నేకాంతముగా సంభాషించుట కనుజ్ఞ నీయవలయును.

పహార్—(రామ లక్ష్మణులవంకఁ దిరిగి) మీరు వెనుకకుఁ బొండు. (తులసీదాసువంకఁ దిరిగి) మా ముప్వురకును శరీరములు వేఱైనను మన స్సొకటియే. కాన నీవు చెప్ప దలఁచినది మాకడ నిరభ్యంతరముగాఁ జెప్పవచ్చును.

తులసీ—అటులైన వినుఁడు. ఆపరాత్పరుఁడు సాక్షిగాఁ జెప్పుచున్నాను. నేను ఆలంగీరు పాదుషావారికడ ఢిల్లీలో నొకలేఖకుఁడను. మహారాష్ట్ర ప్రభువగు శివాజీ మహారాజునకుఁ గొన్ని సందేశములఁ గొనివచ్చితిని.

గోపాలసింహుఁడు—బీజపురమున కేల పోవుచుంటివి ?

పహార్—నీప్రాణములను నిలుపుకొనుటయో విడనాడుటయో నీవే నిర్ణయించుకొనవలసి యున్నది.

తులసీ—క్షత్త్రియపుంగవులారా ! నేను జెప్పుదానియందించుకేనియు నసత్యము లేదని సప్రమాణముగా ఋజువు చేసెదను. ముందు నేను జెప్పున దాలకింపుఁడు. బీజపుర ప్రధానమంత్రి కొకజాగీరును, శివాజీమహారాజున కొక పెద్దజాగీరును పాదుషావా రొసంగుటకును, వా రిరువురును బీజపురమును ఢిల్లీసామ్రాజ్యమునఁ జేర్చుటకును రహస్యపుషరతు లేర్పఱచుకొనిరి.

పహార్—(కను లెఱ్ఱఁజేసి) మూఢుఁడా ! మా ప్రభు వగు ఖాన్ మహామ్మదుపైన రాజద్రోహము నారోపించుచున్నావు. ఇం దసత్యమున్నచో నీపాపఫలము నీ వనుభవింతువు.

తులసీ— మహాప్రభూ! - నాకరములను బంధించివైచిరి. కాని, లేకున్నచో స్వహస్తములతో నావాక్కుల సత్య మును నిర్ధారణ చేసియుందును. నావక్షస్స్థలమునఁ గట్టి యుంపఁబడిక కాగితములను పరీక్షించి చూచిన నన్నియుఁ దమకే తెలియఁగలవు.

గోపాలసింగా కాగితములను దీసి పహార్‌సింగున కొసం గెను. అవి మహారాష్ట్రభాషను వ్రాయఁబడి యుండుటచే నతఁడు వానినిఁ జదువఁజాలకుండెను. మానసింహునకు మహా రాష్ట్రమించుక తెలియును. అందుచే నాపత్రముల నాతని కొసంగెను. అందలి సంగతుల నాతఁడు చదివినకొలఁది నిర్విణ్ణుఁ డై పోవుచుండెను.

మానసింహుఁడు వానిని సంపూర్ణముగాఁ జూచిన పిదప, తులసీదాసు చెప్పినదంతయు సత్యమనియు, ఆలేఖ లపై శివాజీ, బీజపురప్రధానమంత్రి, ఘాదుషాలయొక్క రహస్యముద్రలు కలవనియు, వారు కుట్రలు పన్నుచున్నా రనుట కెంతమాత్రమును సందియము లేదనియుఁ జెప్పి, అజాబుల యర్థమును విపులముగా నాయకున కెఱుక పఱ చెను. పహార్‌సింగు రాజద్రోహులసంబంధియగు తులసీదాసువై నమితాగ్రహముఁ జూపి వీనిని యమసదనమునకంపుట యే యుత్తమ మని మానసింహునితోఁ జెప్పెను. కాని రాజ కార్యధురంధరుఁ డగు నాతఁ డందుల కనుమతింపక, తులసీ దాసును సాక్షినిఁగాఁ గొని తమచేఁ జిక్కినలేఖలను బీజపుర పునవాబునకు రెండుమూఁడు లక్షల రూప్యముల కమ్మవచ్చు నని చెప్పెను. ఈ యోజనకుఁ జోరనాయకుఁడు మిక్కిలి సంత

సించెను. మఱునాఁడు మానసింహ, పహార్‌సింహ, తులసీదాసులు బీజపురమునకుఁ బోవ నిశ్చయించుకొనిరి. అప్పటికే రాత్రి యగుటచే దస్యులసరదారు మిగిలినవారికి సెలవొసంగి తాను శయ్యాగృహమున కరిగెను.

## నాల్గవ ప్రకరణము.

### ఫైజిల్‌ఖానుకోరిక.

ఇల నెవఁడు బ్రదికి యుండఁగఁ
బలువురు బ్రదుకుదురో వాని బ్రదుక బ్రదుకు ప
క్షులు బ్రదుకవెచుండవే ము
క్కులతోఁ దమపొట్ట నింపుకొనుచు ముదమునన్.

(తీక్షల పంచతంత్రము)

బీజపురమున నుండు సౌధరాజములలో అఫ్‌ఝుల్‌ఖానుభవన మున్నతమైనది. దానికిఁ జుట్టును రమణీయమైన పూలతోఁట కలదు. అందు వివిధములైన పుష్పలతలును, అత్యున్నతములైన వృక్షములును గలవు. సాయంసమయములం దావనమున, అఫ్‌ఝుల్‌ఖానుని కుటుంబమువారు సంచారము చేయుచుఁ జల్లనిపిల్లవాయువులచే నానందించుచుందురు. ఆ యుద్యానవనము చుట్టును గొప్పప్రహారీగోడ కలదు. ఒకనాఁటి సాయంకాలమునఁ బూర్ణచంద్రవదన యగు నొక రమణి వనప్రాగ్భాగమున నున్న చలువరాతిన్నెపైఁ గూర్చుండి యెవరికొఱకో యెదురు చూచు చుండెను. పూఁబొదలించుక కదలెనా యామెదృష్టి వానిపైఁ బ్రసరించును. మారుతా

హాతిచే నెందుటాకులచప్పుడు విననయ్యెనా, యామె యావం
కకుఁ జూచును. తాను సరిగ నూహింపఁజాలక పోతినని తెలిసి
కొనినపు డొక్క నిట్టూర్పు విడుచుచుండును.

ఇట్లొకింతకాలము గడచినపిదప "సోదరీ" యను
శబ్దము విననయ్యెను. ఆనాదము వినినంతనే యంతవఱకును
నిశ్చలముగాఁ గూర్చుండియున్న యాకాంత చటాలున లేచి
"ఇచ్చట నున్నాను. ఇటు రమ్ము" అని ప్రత్యుత్తరమిచ్చెను.
ఏమి యాబాలికగాత్ర మాధుర్యము! అంతవఱకును కుహూస్వ
రములు చేయుచున్న కోకిలలుకూడఁ గులుకకున్నవే! పూఁబొద
రిండ్లమాటుననుండి యామెవైపునకు వచ్చుచున్న యానవయౌ
వనకోమలాంగుఁ డెవరు? "సోదరీ!" యని పిలిచిన దితఁడే
కాఁబోలును! ఒక్కత్రుటిలో వా రొండొరుల బాహులత
లలోఁ జిక్కుకొనిరి. "నాలుగుగంటలకే వచ్చెద నని వ్రాసి
యింతయాలస్యము చేసితివేల?" యని యాబాలిక ప్రశ్నింప
"కొన్ని రాజకార్యములచే రాలేకపోతి"నని యాతఁడు ప్రత్యు
త్తర మిచ్చెను. ఆకాలమున బీజపుర రాజ్యమున రాజద్రోహు
లనేకు లుండుటచే నేదైన విప్లవము రానున్న దేమో యని
శంకించి యాతఁ డొనరింపవలసినకార్య మెట్టి దని యా
బాలిక మరలఁ బ్రశ్నించెను. అందుల కాతఁడు సమాధానము
చెప్పుట కిష్టపడలేదు గాని యామె మరల మరల నడుగుటచేఁ
దమగృహమున కేఁగినపిదప నన్నియు వివరముగాఁ దెల్పెదనని
చెప్పి యిప్పటికే చీఁకటిపడుచుండుటచే సోదరీ సమేతముగా
గృహోన్ముఖుఁ డాయెను.

వారిరువురును రూపవంతులే యైనను రూపసాదృశ్యము మాత్రము గానిపించుట లేదు. ఆ పురుషుఁడు నూనూఁగు మీసములతోను, స్వర్ణసమానమగు దేహచ్ఛాయతోను విజ్ఞానమున కాకరములైన నయనములతోను ప్రకాశించుచుండెను. అతఁ డిరువదియేండ్లవయస్సుకలవానివలెఁ గానిపించును.

ఆ బాలిక దేహము ధవళముగా నుండెను. ఆమెకన్నులు శాంతకిరణములను వెదఁజల్లుచుండెను. ఆమెయఱచేతులనుండియు నఖములనుండియుఁ జెక్కులనుండియు నరుణకాంతులు వెలువడుచుండెను. తురుష్కయువతులలో నంతసౌందర్యవతి లేదని ప్రతీతి.

ఆయువతి యువకు లిరువురును తమప్రాసాదమునందలిపై యంతస్తున కెక్కి, పరిమళవాయు పూరితమై యుత్తమదీపములచే వెలుఁగొందుచున్న యొకగదియందుఁ బ్రవేశించి యందొక తివాసీపై నాసీనులైరి వారిసంభాషణము నీక్రిందఁ బొందుపఱచుచున్నారము.

సోదరి—సోదరా ; నీ వ్రనరింపవలసిన రాజకార్యము లేవియో కలవంటివే. అందు నీ వేమైనఁ జిక్కునఁ బడిపోదువేమో యని భయ మందుచున్నాను. ఆ కార్యము లేవియో నే నెఱుంగవచ్చునా ?

సోదరుఁడు—రాజకీయసమస్య లతిక్లిష్టము లైనవి. అందును ప్రస్తుతము మనరాజ్యమునకు రానైయున్న యల్లరులు మాన్పుట మఱియుఁ గష్టతరము. ఇట్టి కఠినసమస్యలను నీ కెఱిఁగించినచో నీమానసము మాందోళనపడు నని నీ కింత వఱకును తెలుపలేదు. కాని నీవు పలుమాఱు లడుగుచుం

టివి గానక్లిష్టముగాఁ జెప్పెద నాలకింపుము మనయేలిక బాలుఁడగుటచే బీజపురమును జయించుట కిదియే తరుణమని యొకవంక ఆలంగీరుషాదుషాయును, మఱియొకవంక శివాజీయును విశ్వప్రయత్నములు చేయుచున్నారు. మన నవాబునకు సామంతుఁడగు పహర్‌సింగును శివాజీమహారాజునకు దక్షిణహస్తమో యనఁదగు తానాజీమాల్సురేయును నేఁడీపురమునకు వచ్చి రని తెలిసికొంటిని. కావున నేను వారిచర్యలను కనిపట్టుటకు మాఱువేసముతోఁ బోఁదలంచితిని.

వీరిట్లు మాటలాడుచుండఁగా దృఢకాయుఁడును వృద్ధుఁడునగు నొకపురుషుఁ డటకు వచ్చెను. ఆతఁడు యుద్ధవిద్యావిశారదుఁ డని పేరొందిన అఫ్జుల్‌ఖానే. సోదరీసోదరు లాతనికిఁ బ్రణమిల్లిరి. అతఁడు వా రిరువురను కౌఁగిలించుకొని శిరములు మూర్కొనెను. ఫెజిల్‌ఖాను తాను జైనాకెఱింగించుచున్న విషయ మాతనికిఁ దెలిపి తనయత్నమున కాతని యనుమతి వేఁడెను. అంత నాతఁ డిట్లు పలికెను. "నాయనా! ఫెజిల్! రాజ్య మిట్టి యరాజకస్థితియం దున్నపుడు నీవంటి యుల్పవయస్కులు రాత్రులయందొంటిగఁ బోరాదు. నేనేపోయి యాపని చక్కఁబెట్టెదను." అనియెను.

ఫెజిల్—తండ్రీ! మీరు నాకన్నఁ జిన్నవయసువారై యున్నపుడే మహాయుద్ధములఁ బాల్గొని జగద్విఖ్యాతులు కాలేదా? నే నట్టిఘనకార్యములకుఁ గడంగుట లేదు సరియే కదా శత్రురహస్యముల నైనఁ గనుఁగొనవలదా? మీ దీవన నన్ను రక్షించుచుండ నా కపాయమెట్లు వాటిల్లును?

అఫ్ఝుల్ — సరియే. ఆలోచింప వచ్చునుగాని నీకుఁ బహార్ సింగుతానాజీమాల్సురే లీపురమునకు నచ్చి రని యెట్లు తెలిసినది ?

ఫెజిల్ — బీజపురమున నుండెడు రాజభక్తి పరాయణులను ధనాశా పిశాచములచే నావహింపఁజేసి రాజద్రోహులుగఁ జేయుటకుఁ దానాజీ యిటకు వచ్చుచుండె నని విని యుంటిమిగదా ! ఆతనికి దిలేర్ ఖాను మిక్కిలి సహాయుఁడని విని యాతని భృత్యునకుఁ గొంత లంచ మిచ్చి యాతనికి వచ్చు లేఖలనకళ్ళను, తదితరరహస్యములను నాకెఱుక పఱుచు మని నెలరోజులక్రిందటఁ జెప్పియుంటిని. ఈ నాఁటి సాయంకాల మాతనిని సంకేతస్థలమునఁ గలిసికొంటిని. ఈదినమునఁ బదిగంటలకొకవార్తాహారివచ్చి దిలేర్ ఖానుతో రహస్యముగ నొకగదిలోఁ గొంతసేపు మాటలాడె ననియు, అది తాను పొంచి వింటిననియుఁ జెప్పెను.

అఫ్ఝుల్ — ఆమాటలు భృత్యుఁడు పూర్తిగ వినెనా ?

ఫెజిల్ — ఆసంభాషణము కొలఁదినిముసములుమాత్రమే జరిగెననియు, అందుఁ దాను జాలవఱకు వింటిననియుఁ జెప్పెను.

అఫ్ఝుల్ — ఆతఁడు వినిన దేమి ?

ఫెజిల్ — పహార్ సింగు కొన్ని మిక్కిలి ముఖ్యమగు కాగితములు పట్టుకొని యీయూరు వచ్చె ననియు, బహుశః ఈపురమున కుత్తరదిక్కున నున్న శ్రీరామాలయమున దిగు ననియు నెంతధన మిచ్చియైనను వానిని వెంటనే గ్రహింపవలయు ననియుఁ దానీరోజున నెంతరాత్రికైనను వచ్చెద ననియుఁ దానాజీ కబురంపెనఁట !

అఫ్జుల్—అందుచే నీవిప్పు డాజ్ఞాలయమునకుఁ బోఁదలంచితివా ?

ఫెజిల్—తమసెలవుకొఱకే వేచియున్నాఁడను.

అఫ్జుల్—వచ్చువాఁడవక్రవిక్రముఁడును, ఎట్టి దారుణమునకైనను వెనుకంజ వేయనివాఁడును నైన పహార్ సింగు. వానిచర్యలను గనిపట్టుటకుఁ బోవువాఁడు ముక్కుపచ్చలారని పసిబాలుఁడు. ఇందుబాలున కెన్నఁడైనను జయము కలుగునా ?

ఫెజిల్—వయనుతో నేమిపని ? "యతో ధర్మ స్తతో జయః" అను బుద్ధిమంతులవాక్కు రిత్తయగునా ? అదియునుగాక నా కెంతవయను వచ్చినను, ముక్కుపచ్చలారని పసిబాలునివలెనే మీకుఁ గానిపించుచుందుమ.

జైనా—సోదరా ! ఈకార్యమునకు నీవేల పోవలయును ? మనబలవంతరావునకుఁ గొందఱు వీరులను సాయ మిచ్చి యేల పంపరాదు ?

ఫెజిల్—సోదరీ ! ఎన్నాళ్లు నేను ముగ్ధవలె నంతఃపురమునఁ గూర్చుందును ? (అఫ్జుల్ఖానువంకఁ దిరిగి) తండ్రీ ! న న్నొంటిగఁ బంపుటకు మీరు శంకించు చుంటిరిగదా ! బలవంతరావును నేనును బోయి యీకార్యమును నిర్వర్తింతెదము. ఇందులకు మీరు సెలవు దయచేయుఁడు.

అఫ్జుల్—సరియే. నీయుత్సాహమును నే నేల భంగము చేయవలయును ? బలవంతరావును గొనిపొమ్ము.

అంత ఫెజిల్‌ఖాను మేడక్రింది చావడిలోనికి దిగి యందుఁ గొందఱు వీరులతో సల్లాపము లాడుచున్న బలవంత రావును బిలిచి తనతండ్రికడకుఁ గొనివచ్చెను. అఫ్జుల్‌ఖాను తనయునిహస్తమును బలవంతరావుకరమున నుంచి యీతనిని వేయికన్నులతోఁ గాపాడు మనిచెప్పెను. అందులకు బలవంత రావు సమ్మతిసూచకముగా శిరమును వంచెను. పిదప ఫెజల్ ఖానతోఁ గూడి సమీపముననున్న యొక గదియందుఁ బ్రవేశించెను. ఇట్లొకపావుగంటకాలము గడచినపిదప, ఆగది నుండి యిరువురు సంన్యాసులు వెలువడిరి. ఇరువురును కాషాయవస్త్రధారణము గావించిరి. దండకమండలువులు వారిచేతులయందు వెలయుచుండెను. శరీర మంతయు బూడి దచేఁ బూయఁబడి యుండెను. ఫాలమున గంగామృత్తికా రేఖలు వెలయుచుండెను. వారిని జూచినంతనే అఫ్జుల్‌ఖాను జైనాలుకూడ మిక్కిలి యాశ్చర్యము నొందిరి. వా రిరు వురును అఫ్జుల్‌ఖానునొద్ద సెలవు గై కొనిరి. ఫెజిల్‌ఖాను సోదరిని కౌఁగిలించుకొని మరల జనకునిదీవనలఁగొని బలవంత రావుతోఁ గలసి గృహము వెడలెను.

---

## అయిదవప్రకరణము.

"తా నొకటి దలఁచిన దైవ మొకటి దలఁచును."

ఆనాఁటిరాత్రి యొనిమిదిగంట లగునప్పటి కంధకారము నలుదిక్కుల వ్యాపించుచుండెను. అప్పు డిరువురు సంన్యాసులు బీజపురపు రాజమార్గమున నుత్తరదిశగాఁ బోవుచుండిరి. కొంత

దూర మఱ్ఱేఁగినపిదప వారు పట్టణాంత్యభాగమునకుఁ జేరిరి. ఆప్రదేశమున నిఱుపేదలు చిన్నచిన్న గుడిసెలను గట్టుకొని యందు వసించుచుందురు. వారాకుటీరములను దాఁటినపిదప నొక మామిడితోఁపుకడకుఁ జేరిరి. అం దొకజీర్ణాలయమును కలదు. దానిచుట్టు నున్న ప్రాకారపుగోడలు కాలవశమున నచ్చటచ్చటఁ గూలిపోయెను. కర్మందివేషధారు లగు ఫెజిల్ బలవంతరావు లాలయపు వెనుకభాగమునుండి మెల్లఁగ మధ్య నున్న కోవెలయొద్దకు వచ్చి యం దెవరైన నుండిరేమోయని గోడకుఁగల రంధ్రములనుండి తొంగిచూచిరి. ఆ గుడిమధ్య భాగమున నెండుసమిధలచేఁ జేయఁబడిన యగ్ని ప్రజ్వరిలు చుండెను. దాని కెదుటిభాగమున దీర్ఘకాయుఁడును, బూదెచేఁ బూయఁబడినశరీరముగలవాఁడు నగునొక సంన్యాసి కూర్చుండి యుండెను. ఆతనికన్నులనుండి ప్రతాపానలము వెలువడుచుం డెను. అప్పుడప్పు డాతని కర్కశశ్మశ్రుజాలమునడుమ వికట హాసము తాండవించుచుండెను. ఆతనివామభాగమున భయముచే నించుక నడఁకుచున్న యుత్తరదేశబ్రాహ్మణుఁ డుండెను.

ఫెజిల్ బలవంతరావులు వారినింకను జూచుచుండఁగనే సంన్యాసి రెండవవానివంకఁ దిరిగి. "తులసీదాసూ! మాతోఁ జెప్పిన ట్లీకాగితములు సరియగున వని వారితోఁ జెప్పకున్నచో నీశిరము నొక్కవ్రేటునఁ దెగవ్రేసెదను. మమ్ములను మోసపుచ్చఁదలఁచినచో నీప్రాణములు నీవి కావని దృఢముగా నమ్ముము." అని పలికెను. అందులకుఁ దులసీదాసు తన సమ్మతిని దెలుపునటులు శిరము పంకించెను. అంతట నా యాలయపుద్వారమును తెఱచుకొని ముగ్గురు పురుషు లా

…రు యున్న యెడకు వచ్చిరి. ఆయాగంతుకులు శ్రీ - ఆలీ యు― షాహాయును, ఆతనికార్యదర్శియు, మఱియొకక్షత్రియుఁడు నని ఫెజిల్ బలవంతరావులు కనుఁగొనిరి. కార్యదర్శి రాజద్రోహి యై బాలుఁ డగునవాబు నీభయంకరప్రదేశమునకుఁ గొనివచ్చె నని శంకించి యాతనికి సాహాయ్యమొనర్పవలయు నని ఫెజిల్‌ఖాను తనచంద్రహాస మొరనుండి తీసెను గాని బలవంతరావుచే వారింపఁబడి తాను దాఁగి యున్నచోటనే నిలిచిపోయెను. అంతట నాక్షత్రియుఁడు సంన్యాసి కేదియో రహస్యముగఁ దెలిపెను. రాజును, ఆతని కార్యదర్శియుఁ గూర్చున్నపిదపఁ దులసీదా సిట్లు చెప్పఁదొడంగెను. "బీజపురరాజ్య ప్రధాననాయకులారా! యవనరాజ్య స్థాపన ప్రవీణులారా! రాజకార్యధురంధరులును, రాజభక్తి పరాయణులు నగు మీ కీర్తి నలుదిక్కుల వ్యాపించు —"

అనునంతలోఁ గార్యదర్శి ముఖము చిట్లించి, "చాలు నూరకుండుము. ఔరంగజేబునకుఁ బ్రియములైన నీవందిగీతములు నాఁపి ప్రస్తుత కార్యమునకుఁ గడంగుము" అనెను. అందులకుఁ దులసీదాసు, "చిత్తము. అదియే చెప్పఁబోవుచుంటిని. నేను ఢిల్లీసార్వభౌమునియొద్దనుండి శివాజీమహారాజునకు సందేశములఁ గొనిపోవుచు మార్గమధ్యమునఁ బహారీసింహానిభటులచేఁ బట్టుపడితిని. మీ కత్యంతోపయుక్తము లగు కొన్నికాగితములను వారు నాకడనుండి గ్రహించిరి. వాని మూలముననఁగాని రాజద్రోహులను కనుఁగొని మీరు శిక్షింపఁజాలరు. ఆపత్రములు సంన్యాసివేషధారియగు పహాక్ సింగు

కడ నున్నవి. ఇప్పుడు మిమ్ముల నిటకుఁ గొనివచ్చినవాఁ డాతని దాయాదుఁ డగు మానసింహుఁడు." అనియెను.

ఈపలుకు లాలించినతోడనే ఫెజిల్ బలవంతరావులు మిక్కిలి వెఱఁగందిరి. ఎవరికొఱకు వారి కాభీతి? తుచ్ఛములగుతమ దేహసుఖక్షేమములకు వెఱఁ గొందునంతటిమూర్ఖులా వారు? కారు. అతిదుర్మార్గుఁడును, బీజపురరాజ్యమును ధిక్కరించి స్వాతంత్ర్యమును గొనినవాఁడును, క్షత్త్రియ వీరశిఖామణియు మానసహాయుఁడు నగు షహాక్ సింగుముందర యల్పవయస్కుఁ డగు నవాబు, ఏకకార్యదర్శిసహాయుఁడై నిర్జనప్రదేశమున నిలుచుట యపాయకరము గదా! ఇదియే ఫెజిల్ బలవంతరావుల భయమునకు మూలకారణము. బలవంతరా వాఁపకున్నచో, ఫెజిల్ఖా నొకక్షణమున నవాబు వామభాగమున నుండెడివాఁడే. బలవంతరా వాలోచనపరుఁడు. ఏకార్యమునందును, తొందరపడువాఁడు కాఁడు. నవాబు వయసున బాలుఁడైనను ఆలోచనలయందు వృద్ధుఁడేయనియు, కార్యదర్శి రాజభక్తిపరాయణుఁ డనియు నాతని నమ్మకము. తా మాలయముఁ జొచ్చినచోఁ గార్యభంగ మగు నని యాతఁ డెఱుంగును. ఫెజిల్ఖానున కీ వన్నియుఁ దెలిపి యెప్పు డవసర మైన నప్పుడే సాహాయ్యపడవచ్చు నని చెప్పి యాతని నాఁపివైచెను.

వ్రాయుట కింతకాలము పట్టెనే కాని యిది యంతయు నొకక్షణములో జరిగిపోయెను. తరువాత వా రిరువురును ఆలయమున జరగుచున్న సంభాషణను శ్రద్ధతో నాలకింపఁ గడంగిరి.

తులసీ—వారికడనుండి కాగితములను బలవంతముగా దీసి కొనుట యసాధ్య మని చెప్ప నక్కఱలేదు. కావున వారు కోరినధన మొసంగి వానిని దీసికొనుఁడు.

కార్యదర్శి—మీకడ నున్నపత్రములు సత్య మగునవియో లేక కల్పింపఁబడినవో మా కేమి తెలియును ?

"మీరు వానిని పరీక్షించుకొనుఁడు" అని చెప్పి పహార్ సింగు కొన్ని కాగితములను కార్యదర్శికడఁ బడవైచెను. వానిని కొంతవఱకుఁ బరీక్షించిన పిదప నామంత్రి వానిని ప్రభువునకుఁ జూపి మరల వారి కొసంగెను. "ఈ పత్రముల నెంతకు విక్రయింపఁదలంచితివి ?" అని మంత్రి ప్రశ్నించెను.

పహార్—మూఁడులక్ష లని నేను కబు రంపలేదా ?

మంత్రి—సరియే. మేము కోటలోనికిఁ బోయి యీవిషయ మాలోచించి తెలియఁబఱిచెదము.

"పహార్ సింగును మోసపుచ్చువా రిదివఱకుఁ బుట్టి యుండలేదు." అని గర్జించుచు బూటులోఁ గప్పబడియున్న కత్తిని చటాలునఁ దీసి ఆదిల్ షాహా మెడపై నుంచి మేఘ గంభీర భాషణముల నాతఁ డిట్లనియె. "ఈసారి మమ్ములను మోసముచేయ నెంచినచో నీరాజు మృతిఁ జెందు నని నమ్ముము. ఈక్షణమే పోయి సొమ్ము మానసింహునిచేఁ బంపుము. నీభటులచే మమ్మును బట్టింప నెంచినచో మే మవలీలగాఁ దప్పించుకొందుము గాని నీరాజు నీ కుండఁడు."

ఇందలిసత్య మంతయుఁ బాప మాకార్యదర్శికిఁ దేట పడెను. తనయల్పకృపాణముచేఁ జోరనాయకుని నెదిరించినచో

హాని వాటిల్లు నని గ్రహించెను. అతఁ డెట్లు చేయుటకును తోఁచక నిస్తబ్ధుఁ డై పోయెను.

ఫెజిల్ బలవంతరావుల స్థితికూడ నట్లే యుండెను. వారు ద్వారమును భేదించుకొని వచ్చులోపలఁ బహర్ సింగు నవాబు నంత మొందింపక మానఁడు. ఆ కారణముచే వా రిరువురును మంత్రపాశగతమైన కృష్ణసర్పముల వలె నిలిచిపోయిరి.

భయంకరమైనయట్టి విపత్సమయమున ధైర్యము చెడక నిశ్చలుఁడై యున్న వాఁ డొక్క ఆదిల్ షాహా యే.అతఁడు మంత్రి వంకఁ దిరిగి, "కార్యదర్శీ ! నూతుచ్ఛప్రాణములఁ గొన్న వీని కేమి లాభించును ? కావున మాప్రాణముల నీతఁడ కారణముగ నాశింపఁడు కావున మాకు హాని రాఁబోవు నన్న భయము డక్కి, కోటలోనికిఁ బోయి ధనము నిచ్చివేయుము. నీ వాతని నిబంధనల మీఱకున్నచో మమ్ము నతఁడు హత్య చేయఁడు." అని చెప్పెను.

తనకు సొమ్ము సురక్షితముగాఁ జేరినచో నవాబు ప్రాణముల కేమియు భయము లే దని పహర్ సింగు చెప్పెను. కార్యదర్శి, రాజు చెప్పినచొప్పునఁ జేయుటకై యాతనికడ సెలవు గొని పోవుచుండ, తమ్ముఁ బట్టింప యత్నించినచో సార్వభౌముని చంపివైచెద నని పహర్ సింగు హెచ్చరించి ద్రవ్యమును గొనుట కాతనివెంట మానసింహుని బంపెను. వారు పూర్తిగా నాలయము దాఁటువఱకును పహర్ సింగుకత్తి నవాబు మెడపై ననే యుండెను. వారు వెడలిపోయినపిదపఁ జోర నాయకుఁడు రాజునకు మోఁకరించి, "బీజపుర సార్వభౌమా నా వెనుకటి తప్పులన్నియు మన్నింపుము. నేను పిఱికిపందలను

గొల్చుట కిష్టపడను. నీవు ధైర్యవిహీనుఁడ వయినబాలుఁడ వనియు, నిత్యభోగప్రియుఁడ వనియు విని మీ సేనలను పలుతావుల నెదిరించి జయించితిని. ఇప్పటి నీధైర్యము నన్నాశ్చర్యసాగరమున ముంచివైచుచున్నది. మృత్యుదంష్ట్రల నుండియు ధైర్యమును వీడకుండుట యాశ్చర్యకరము గాదా? నేఁటనుండియు నేను నిన్నతి విశ్వాసముతోఁ గొల్చుచుందు నని ప్రతినఁ జేయుచున్నాను. నేను నీకు సాహాయ్యపడెద నని యెవ్వరితోడను చెప్పవలదు. ఈకాలమున నెవ్వరిని నమ్మరాదు. నేను నిన్నుఁ గొల్చుచుంటి నని తెలియకుండుటకే, నే నీధనమును గ్రహించెదను. నాకడ విశ్వాసపాత్రులును, శూరశిఖామణులు నగు మూఁడువేలయాశ్వికులు గలరు. వారితోఁ గలసి నేను నిన్ను సేవించెదను. శత్రురహస్యములు దెలిసినపుడు మీ కెఱింగించుటకు ఫకీరువేషముతో 'దేవుఁ డిచ్చినది గైకొందును.' అని యఱచుచు వత్తును. అప్పుడు నన్ను నీ దర్శనమునకు రప్పించుకొనుము. నే నెంత యుపయుక్తుఁడనో నీకుఁ గొలఁదికాలముననే తెలియఁగలదు. నాపూర్వదోషముల క్షమించి నాకభయహస్తము నిమ్ము" అని ప్రార్థించెను. కరుణార్ద్రహృదయుఁడగు నవాబు బహర్‌సింగుశిరముపైఁ జేయి వైచి, "నీపూర్వ దోషము లన్నియు క్షమింపఁబడినవి. ఇటుపైన రాజభక్తిపరాయణుఁడవై మనుము." అని దీవించి తన హస్తము నాతని కొసంగెను. ఆకరము నాతఁడు ముద్దిడుకొనెను. అప్పటికే మానసింహాదులు వచ్చువేళ యగుచుండుటచేఁ బహర్‌సింగు తన యెప్పటి రూపమును దాల్చి నవాబు శిరముపైఁ గత్తినుంచి యెప్పటివలె నిలువఁబడెను.

అంతటఁ దలుపు తెఱచుకొని మానసింహుఁడును రాజ కార్యదర్శియు వచ్చిరి. ధనము పూర్తిగ ముట్టిన దని చోర నాయకుఁడు తెలిసికొనినపిదప వా రిరువురను విడిచివైచెను. వారు వెడలునపుడు తన్నుఁ గీసికొని పొమ్మని తులసీదా సెంతో ప్రార్థించెను గాని వా రాతనిమాటలను వినిపించు కొనకయే వెడలిపోయిరి.

అటుపిదప మానసింహపహార్సింగులను కాగితములపై వచ్చినదబ్బులోఁ దనభాగము తన కిమ్మని తులసీదాసు కోరెను. అగ్నిలో నేయిపోసిన ట్లదివఱకే మండుచున్న చోరనాయకుని క్రోధాగ్ని యీమాటతో నొక్కసారిగాఁ బ్రజ్వలించెను. ఆతఁడు తనకత్తితోఁ దులసీదాసు నొక్క దెబ్బ కొట్టెను. దానితో నొక్కకేక వైచి యాతఁడు నేలఁ గూలెను అంతటఁ సదాలగ ద్వారములను పగులఁదన్ని ఫెజిల్ బలవంతరావులు చేతఁ గృపాణములు ధరించి పహార్సింహ మానసింహులపైఁ బడిరి. అందుచే వారు తమధనమును గ్రహించి గోడలను దాఁటి యొక్కక్షణములో మాయమైపోయిరి. ఫెజిల్ బలవంత రావులు తులసీదాసుకడకు వచ్చిరి. బలవంతరావున కించుక వైద్యము తెలియుటచేత నాతనినాడి చూచి ప్రాణభయము లేదని గ్రహించి గాయమునకుఁ గట్టు కట్టి చేరువనున్న చెఱువునుండి జలము దెచ్చి వాని ముఖముపైనఁ జిలికెను. ఆ నీటిచే నాతఁడు సేదదేఱియుంకను భయముచే వడఁకుచుండ పహార్సింహ మానసింహులపలాయన మాతని కెఱింగించి ఫెజిల్ఖా నాతని భయమును బాపెను. అంతట బలవంతరావు

సమీపమున నున్న పురరక్షకశాఖవారిని రావించి వారిని తులసీదాసునిరక్షణమునకు నియోగించెను.

పిదప వా రిరువురును కారాగృహాధిపతియగు దిలేర్ ఖానుయొక్క విశ్రాంతిగృహమువంక కరుగుచుండిరి. అప్పటికి రాత్రి రెండుగంట లాయెను. ఆకాశ మంతయు మేఘావృతమై యుండెను. నిమిషనిమిషమునకును ఉఱుము లెక్కువ యగు చుండెను. అంధకార మయమగు నీ ప్రపంచమునందలి పథికు లకు మార్గమును జూపుటకో యన విద్యుత్కాంతులు తళతళ మెఱసిపోవుచు నప్పటప్పటఁ గానిపించు చుండెను. మెల్ల మెల్లఁగా వర్ష మారంభించినది.

ఆసమయముననే ఫెజిల్ బలవంతరావులు దిలేర్ ఖాను విశ్రాంతిగృహమునకు వచ్చిరి. అఫ్ఝల్‌ఖాను మందిరమువలె నాతనినిలయ మంతమైనది గాకున్నను, అం దున్నవారిని పట్టు కొనుట కడు దుష్కరము. అం దనేకరహస్యపు మార్గములు గలవు. బలవంతరా వాగృహము ద్వారముకడకువచ్చి యచ్చట నున్న ప్రతీహారిని తమకు నిలుచుటకుఁ దా వొసంగు మని కోరెను. కాని యాతఁడు సమ్మతింపలేదు. నిశాసమయమున వర్షములో నెక్కడికిఁ బోదు మని యెంత మొఱయిడినను వారికి విశ్రమించుటకుఁ దా వొసఁగ సమ్మతింపలేదు. బలవం తముననైనను తా మచట నుండవలయు నని తలుపులను ద్రోసి ఫెజిల్ బలవంతరావులు లోనఁ బ్రవేశించిరి. ద్వారరక్ష కుఁడు "వలదు వల"దని గట్టిగాఁ గేక వేయుచు గుమ్మమున కడ్డుగా నిలిచెను. ఆశబ్దము నాలకించి లోపలనుండి మువ్వురు పురుషులు కరవాలములతో ద్వారము కడకు వచ్చిరి. అం

దొకఁడు దృఢకాయుఁడును ఆజానుబాహుఁడునై యుండెను. ఆతనివదనమునుండి వీరరసము తొలఁకాడుచుండెను. ఆతఁడు సంన్యాసులవంకఁ దిరిగిఁ మీ రెవరు? ఏల యిచట బలవంతముగా నిలువఁదలఁచితిరి? ఇంకొక గృహమునకుఁ బోరాదా?" అని ప్రశ్నించెను.

బలవం—మేము తులజాపుర సంన్యాసులము. కాశీయాత్రకుఁ బోవుచు నీపురమును జూడవచ్చితిమి. మే మీసమీపమున నున్నయొకచెట్టుక్రింద శయనించి యుండ వర్షమారంభించెను. ఈ రాత్రి కీగృహమునఁ దల దాఁచుకొనఁ దలఁచి యుండ మీ ప్రతీహారి మమ్ము వారించెను. మే మిపుడెచటికిఁ బోఁగలము?

వీరుఁడు—మీరు తులజాపురమున నుండు సంన్యాసుల నెవరినైన నెఱుంగుదురా?

బలవం—మాగురు వగుపురాణగురు వాపురముననే వసించుచుండెను.

వీరుఁడు—పురాణగురువా? (అని యాశ్చర్యముగాఁ బలికెను.)

బలవం—అవును. నేను పురాణగురునిశిష్యుఁడ నగు వసంతగిరుఁడను. (ఫెజిల్‌వంకఁ జూపి) నా కితఁడు సహచరుఁడు.

వీరుఁడు—నా పేరు తానాజీ మాల్సురే.

బలవం—మీరు తానాజీమాల్సురే యైనచో మీకడ మాకు రహస్యములు లేవు. మేము పహర్‌సింగునకుఁ బురాణగురునివలన నొకలేఖను గొనివచ్చితిమి.

తానా—పహర్‌సింగు మీకుఁ గనుపడెనా?

బలవం—మే మిప్పు డాతనికడనుండియే వచ్చు చుంటిమి.

ఆతఁడీపురమున కుత్తరమున నున్న జీర్ణాలయమున నున్నాఁడు.

తానా—నిజముగ మీ రాతని నటుఁ జూచితిరా ?

బలవం—మీ కంత నమ్మకము లేనిచో నెవరినైనఁ బంపుఁడు.

తానాజీ తనయనుచరులలో నొకని నాయాలయము నకుఁ బంపి యెట్టులైనను పహర్ సింగును తనకడకుఁ గొనిర మ్మని చెప్పెను. ఇంతవఱకును తానాజీ కరవాలమును చేత ధరించి యుద్ధమునకు సిద్ధపడి యుండెను. కాని యిప్పుడు కత్తి నొరలో నుంచుకొని యజాగ్రత్తగా నుండెను. బలవంతరా విదియే సమయ మని గ్రహించి, ఫెజిల్ ఖానునకు సంజ్ఞ చేసి తనచోగాలో గుప్తపఱచిన ఖడ్గమును దీసి తానాజీపై నువ్వెత్తుగాఁ బడెను. ఫెజిల్ ఖానుకూడఁ దానాజీయనుచరునిపైఁ దలపడెను. తన్ను నెదిరించువారు ముగ్గురు కల రనియే బలవంతరావు తానాజీని మాయచేసి యొకనిని జీర్ణాలయమునకుఁ బంపెను. బలవంతరావు తనశక్తినంతయు నుపయోగించి మొదటనే తానాజీని మస్తకముపైఁ గొట్ట యత్నించెను. కాని దైవవశమున నాకత్తి యాయింటి * గోపానసియందు గ్రుచ్చుకొనిపోయెను. ఆయింటివసారా యంత పొట్టిదిగా లేకున్నచో ఆకరవాలము తానాజీతలపైఁ బడి యాతనిని యమసదనమునకుఁ బంపవలసినదే. తనయపాయస్థితిని గ్రహించి తానాజీ, తన చంద్రహాసమును దీసి బలవంతరావుపైనఁ బడెను. పాపము! బలవంతరావు తనకత్తిని దూలములో

* గోపానసి యనఁగా వసారాల కుండు దూలము.

నుండి లాగివైచి తననేర్పు నంతయుఁ గనఁబఱచుచు యుద్ధము చేసెను గాని ద్వంద్వయుద్ధమునందసమాన ప్రజ్ఞగల తానాజీ ముందు నిలుచుటకే కష్టముగా నుండెను. బలవంతరావు, తానాజీ నొక్కవ్రేటుతోఁ జంపివేయవలయు నని తలంచెను గానిదైవ మందులకుఁ బ్రతికూల మాయెను.

ఫెజిల్‌ఖాను బాలుఁడైనను తనయసమానసామర్థ్యము చేతను, చాకచక్యముచేతను బలిష్ఠుఁడగు తనశత్రుని భుజములపైఁ గట్టిదెబ్బ కొట్టెను. దానితో నాతఁడు నేలఁ బడెను. ఆసమయముననే తానాజీ బలవంతరావుతలపైనఁ గత్తితోఁ గొట్టుటచేత నాతనిశిరముననుండి రక్తము కారు చుండెను. ఆదెబ్బతో నాతఁడు మూర్ఛిల్లెను. ఫెజిల్‌ఖాను తానాజీపైఁ బలపడెనుగాని యామహారాష్ట్రవీరుఁ డాతనిచేతి కృపాణమును రెండు తునుక లగునట్లు గొట్టివైచెను. ఖానుని జంపుట యాతని కొక్కనిముసపుఁబనియే. కాని యాతఁడు నిష్కారణముగా మానవరుధిరమును గ్రోలుట కిష్టపడఁడు. కావుననాతఁడు దీపము నార్పివైచి పడియున్న మహారాష్ట్రు నెత్తికొని దొడ్డిమార్గమున వెడలిపోయెను.

ఇది యంతయు నైదాఱునిముసములలో జరగి పోయెను. ఈనలుగురు వీరులును యుద్ధమునకుఁ గడంగుటచూచి ద్వారరక్షకుఁడు రెండు మూఁడు నిముసములుభయముచే వడఁకుచు నిలువఁబడిపోయెను. అంతట వీరివీరాలాపములను, కత్తులతాఁకుడుచేఁ గలిగిన "ఖణేల్—ఖణేల్" మనుశబ్దములను విని యామార్గమునఁ బోవుచున్న పురరక్షకు లాగృహమునఁ బ్రవేశించిరి. ఫెజిల్‌ఖాను తా నెవరో వారి కెఱుకపఱచి తానాజీని

వెదకుటకుఁ గొందఱను నియోగించి, ఒకనిని వైద్యుని రావిం చుటకుఁ బంపెను. తాను బలవంతరావు గాయమునకుఁ దన వస్త్రమును జించి కట్టుగట్టి ముఖముపై వర్షజలమును జల్లెను. దానితో నాతని కించుక స్మృతి వచ్చెను.

## ఆ ఱ వ ప్ర క ర ణ ము.

### దిలేర్‌ఖానువిశ్రాంతిగృహమున కఫ్జుల్‌ఖాను పోవుట.

ఫెజిల్ బలవంతరావులు గృహము విడిచి పోయినది మొద లఫ్జుల్‌ఖాను మేల్కొనియే యుండెను. ఆతఁడు ప్రతినిమిషమునను వారిరాక కెదురు చూచుచుండెను. రాత్రి మూఁడు గంట లగునప్పటి కాతనికిఁ జిన్నకునుకు పట్టెను. జైనా కునికిపాట్లు పడుచున్నను ఎట్లో మేల్కొనియే యుం డెను. తెల్లవారుజామున నాల్గుగంట లగునప్పటికి గృహసేవకుఁ డొకఁడు లోనికి వచ్చి పురరక్షకుఁ డొకఁడత్యవసర మగునొక విషయమును నివేదింప వచ్చెనని చెప్పెను. ఆమె తండ్రిని మేల్కొలిపి క్రిందికిఁ బంపెను. ఆమె, పురరక్షకుఁ డేమిసమా చారము దెచ్చెనో యని భయపడుచుఁ గూర్చుండి యుండెను. అంతట నఫ్జుల్‌ఖాను ప్రవేశించి, ఫెజిల్‌ఖాను క్షేమముగా నుండె ననియు, బలవంతరావునకు బలమగు గాయము తగిలె ననియు జైనాకుఁ దెలిపెను. తన సోదరుని క్షేమము విని సంత సించెను గాని బలవంతరావుస్థితి వినినంతనే యామె సంతో షము మటుమాయ మాయెను.

అఫ్జుల్‌ఖాను భవనము క్రింది యంతస్తునందు నలువం డ్రాశ్వికభటు లెప్పుడును వసించుచుందురు. వా రీతని చక్ర రక్షకులు. రాజ్యమరాజకస్థితియందుండుటచేతను, రాజ్యమును ద్రోహుల పాలు గాకుండునట్లు చేయుటకుఁ గంకణము గట్టు కొనుటచేతను ఆతఁడురాత్రులం దొంటిగా వీథులలోఁ బోవుట కిష్టపడఁడు కావున, నాతఁడు చక్రరక్షక పరివేష్టితుఁడై దిలేరు ఖానుని విశ్రాంతిగృహమువంకకు బయలువెడలెను. వీ రచటికిఁ బోవునప్పటికే వైద్యుఁడు వచ్చి బలవంతరావునకు మందిచ్చెను. దెబ్బ బలీయముగాఁ దగిలెను గాని ప్రాణభయము లే దని యాతఁడు చెప్పెను. అఫ్జుల్‌ఖాను, తనయునివలన జరగిన సం గతు లన్నియుఁ దెలిసికొని తన మిత్త్రుఁడగు బీజపుర ప్రధాన మంత్రి రాజద్రోహి యాయె నని విని మిక్కిలి విచారించెను. ఆతని తనయుఁడగు ఖోవాస్‌ఖాను రాజద్రోహి కాఁ డని యాతఁ డెఱుంగును.

అందుచే నాతఁడు కుట్రయందుఁ జేరకుండునట్లు కాపాడు మని ఫైజిల్‌ఖానుతోఁ జెప్పెను. పురరక్షకు లెఱుంగనివారి నెవ్వరిని పట్టణము దాఁటి పోనీయవల దని పురద్వారరక్షకుల కాజ్ఞల నంపెను. అంతటఁ దులసీదా సచటికివచ్చెను. ఆతనికి పెద్దగాయము తగులలేదు. ఆతనివలనఁ గొన్ని విషయములను గ్రహించి, తనయొద్ద నుండు మని యఫ్జుల్‌ఖా నాతనిని గోరెను. వెనకఁబోయినతీగ కాళ్లకుఁ జుట్టుకొనిన ట్లాతని కికోరికవరమువలెఁ గానిపించెను. బలవంతరావును పల్లకిలోనిడు కొని తక్కినవా రందఱు నఫ్జుల్‌ఖానుభవనమునకుఁ బోయిరి.

# ఏడవ ప్రకరణము.

## నవాబు రహస్యాలోచన.

మనపూర్వుల శిల్పకళానైపుణ్యమును జూడవలెనన్నచో బీజపురరాజ్య ప్రాసాదమును జూచి తీరవలయును. ఈసుందర భవనము భాగీరథియను మహారాజ్ఞికొఱకు నిర్మింపఁబడెను. పాడువడిన బీజపురపుఁగోటయం దిప్పటికిని చూపఱ కాశ్చర్యము గొలుపుచున్న యేడంతస్తులభవన మదియే. అందు రెండంతస్తు లశనిపాతముచేఁ బూర్తిగా శిథిలమై మిగిలినవి మాత్రము కానవచ్చుచున్నవి. అందు మూఁడవది యిప్పటికిని సుందరతరమై, భవనమంతయుఁ బాడువడకయు న్నెంత గొప్ప భవనమో ఊహింప నవకాశ మొసంగుచుండెను. ఇదికూడఁ బలుతావులందుఁ బాడువడుచుండెను. గోడలపైనఁ జిత్రింపఁబడిన విగ్రహములును, ద్వారములపైనఁ జెక్కఁబడిన జిలుఁగు పనియు, గృహాంగణములం దుంపఁబడిన చలువరాతి ప్రతిమలును శిథిల మగుచుండెను.

ఈకాలమున నాప్రాసాదమిట్టిహీనస్థితియం దున్నను, ఆనాఁటిశిల్పులఘనతను వివేకంబులఁ జాటుట కది యెంతయుఁ దగియుండెను. ఆభవనము సుందరములైన పలుకిటికీలచే నొప్పి వలయునంత వాయువును వెలుతురు నొసంగుచుండెను. కాని యిప్పుడాకిటికీలకుఁ దలుపులు లేకపోవుటచే వర్షము, గాలి, సూర్యరశ్మి మున్నగువానిచే నానాఁటి కాభవనము నశించి పోవుచుండెను. పైయంతస్తులు విశేషముగాఁ బడిపోవుటచే జనులు పోయి చూచుట కనువుగా లేకుండెను. కాని పై

నుదాహరింపఁబడిన మూఁడవ యంతస్తునందలి కిటికీలలోఁ గూర్చుండి క్రింద నున్న శిథిలభవనమును జూచినచో జగమం దెంత గొప్పవను వెనను నశింపవలసినదేకదా యని తోఁపక పోదు. ఈప్రాసాదమున కించుక దూరమునఁ బాడువడిన పురవీథులు, మసీదులు, గోరీలు, భవనములు మున్నగు మేలు కట్టడములు కానవచ్చును.

ఆలీఆదిల్ షాహాపాలనమున, బీజపురమునందలి వైనఁ జెప్పఁబడిన భవనము లన్నియుఁ బూర్ణకళలతో విరాజిల్లుచుం డెను. రాజప్రాసాదమునకుఁ బశ్చిమదక్షిణ భాగములయందుఁ బట్టణము నిర్మింపఁబడియెను.

దిలేర్‌ఖాను గృహమున, క్రిందటి ప్రకరణమునందు వ్రాసిన ద్వంద్వయుద్ధములు జరగుచున్న సమయమున రాజ సౌధమున నుండు కచేరిచావడియందు బీజపురపు నవాబు విశ్వాసపాత్రు లగుకొంద ఱుద్యోగులతోఁ గార్యాలోచనముఁ జేయుచుండెను. తనతండ్రి కృపచే రాజ్యమునందలి యున్నత పదవి నందఁగలిగిన ఖానుమహమ్మదు రాజద్రోహి యని తెలిసి కొనుటచే నవాబు మిక్కిలి ఖిన్నుఁడాయెను. ఖానుమహమ్మదు పూర్వపు నవాబుకడ నౌకరుగాఁ జేరి యాతనికి సమస్తోప చారములను జేసి యాతనిదయను సంపాదించెను. అతని కృప చేతనే ఆస్థానమున లేఖకోద్యోగము నీతఁడు సంపాదింపఁ గలిగెను. ఈతఁడు విశ్వాసపాత్రుఁ డని నమ్మి మహారాజీతనికిఁ గ్రమక్రమముగాఁ బ్రధానమంత్రిపదవి యొసంగెను. కల నైనను తలఁచి యుండని యగ్రస్థానము తన కలవడుటచేత నీతఁడు మదించిపోయెను. నానాఁటికి ధనకాంక్ష యొక్క

వాయెను. అందుచేతనే నేఁడు ఢిల్లీసార్వభౌమునితో రహస్య
ముగఁ జేరి, బీజపురరాజ్యపతనమున కీతఁడు ప్రయత్నించు
చుండెను. ఖానిసతనమును తొలఁగించి ప్రధానమంత్రిని
గావించిన సార్వభౌముని తనయునిపైనఁ గుట్రలు పన్నుట
కాతనిమన సెటు లొప్పెనో? ధనాధికారములు గలవా రెట్టి
దోషకృత్యములకైన నొడఁబడుదురు గదా! విత్తవంతులలో
గుణవంతు లుండు టరుదు. ఖాను మహమ్మదునకును, అఫ్జల్
ఖానునకును ఎక్కువమైత్రి గలదు. అందుచేతనే నవాబున
కఫ్జల్ ఖానునిగూడ సందేహింపవలసివచ్చెను.

పహర్ సింగుకడనుండి కొనివచ్చిన కాగితములను సం
రక్షించుటకు నవాబు తనకార్యదర్శితోఁ గూడ రాజమంది
రమునం దున్న యాలోచన మందిరమునందుఁ గూర్చుండియుం
డెను. ఆ పత్రములు మహారాష్ట్ర భాషలో వ్రాసియుండుటచే
వారి కేమియుఁ దెలియలేదు. అందుచేత విశ్వాసపాత్రుఁడగు
నీలకంఠరాయలను గొని రమ్మని యొకభటుని బంపిరి. ఆతఁ
డా సమయమునందు సుఖముగాఁ దనగృహమున శయనించి
యుండెను. రాజాజ్ఞను వినినతోడనే యాతఁడు దుస్తులను
ధరించి రాజప్రాసాదమున కతిసంభ్రమమున నరుగుదెంచెను
అంతయర్ధరాత్రివేళఁ దన్ను రావించుటకుఁగల కారణమేమో
యాతఁడు గ్రహింపఁజాలకుండెను.

నీలకంఠరాయలు వచ్చినతోడనే యాతనిని గూర్చుండ
నియోగించి యాతనితో నవా బిట్లనెను. "బ్రాహ్మణోత్తమా
నీయందు మాకుఁగల నమ్మకముచేతనే రహస్యకార్యాలోచనఁ
యందుఁగూడ నిన్ను రావించితిమి. రాజద్రోహ మనునట్

నీకు దూర మని మేమెఱుంగుదుము. ఇంతవఱకును రాజభక్తా గ్రగణ్యుఁడని మన మెంచుచున్నయొకఁడు రాజద్రోహి యని తెలిసికొనఁగలవు. అందులకు సంభ్రమపడవలదు. మాశ్రేయ మును గోరుమీాబోఁటివారి సాహాయ్యముచేత మేము తప్పక జయ మందుదు మని మాకు ధైర్యము గలదు. ఇప్పుడు నీ కొసంగఁబోవు కాగితములలో నున్నసంగతు లెవరికిని తెలుపఁ గూడదు." అని చెప్పి కొన్ని పత్రముల నాతనిముందు పడ వైచి చదువు మనెను. నీలకంఠరాయ లందులకు సమ్మతించి యాకాగితములను జదివి వారిక వినిపించెను. అం దవసరమగు వాని నిచటఁ బొందుపఱుచుచున్నాము:—

"దైవేచ్ఛచేత ఫాదుషావారిసైన్యములకుఁ గ్రిందటి దండయాత్రలో మరలి రావలసివచ్చినది. అది వారిమనస్సును బాధింపకుండునుగాక! మరల దైవఘటనచే వారికి విజయము చేకూరుసమయము వచ్చుచున్నది. అందులకు నేను విశ్వ ప్రయత్నములఁ జేయుచున్నాను. ఇప్పటికేచాలమంది ఫాదుషా వారిపక్షమునకుమరలిరి. కొంద ఱింకను ఏపక్షమున నుందుమా యని యోజించుచున్నారు. మఱికొందఱు నవాబున కను కూలురై యున్నారు గాని వా రతిస్వల్పసంఖ్యాకులు. కొలఁది మాసములలో సర్వమును సిద్ధపఱిచి ఫాదుషావారి కెఱిఁగించి వారిసైన్యమునకు బీజపురమున స్వాగతాదిసత్కారము లొసం గుదుము. అసత్యపూర్ణమగు షియాతెగవారి యాచారము లందును, ఏమియు నెఱుంగని బాలుని పరిపాలనమునందును మాకు విసువు జనించినది. ఫాదుషావారు విజయ మొందిన పిదప బాలునకుఁ దగువిధమున నేర్పాటు చేయవచ్చును. మీారు

నాకుఁ జూపఁబోవు హితమునకుఁ గృతజ్ఞుఁడను. ఫాదుషావారి రాజ్యము త్వరలో విస్తరింపవలయు నని కోరుచున్న.—

ఖానుమహామ్మదు వ్రాలు.

"బీజపుర ప్రధానమంత్రి"

మిగిలిన లేఖలలో శివాజీ వ్రాసినవి కొన్ని యుండెను. అతని జనకునకుఁ బూర్వపు బీజపురపునవాబు విధించిననాల్గు వత్సరముల కైదునకును, హైందవులపై విధించుచున్న యన్యాయపుఁబన్నులను గుఱించియు; పరిహారమును గోరుచు, శివాజీ మహారాజు తనపితృపితామహులనుండివచ్చుచున్న స్వాతంత్ర్యమును గోరుచుఁ, దనసైన్యములతో నవాబుపక్షమున నుండుట కొఱకుఁ దనుజ్ఞ వేఁడెను. ఈవిషయమును గూర్చియే మఱికొన్ని లేఖలనుగూడ శివాజీ వ్రాసియుండెను.

ఈకాగితములను జదివినపిదప ఖానుమహమ్మదునకు మరణశిక్ష విధింపవలయు నని వారు మువ్వురు నేకగ్రీవముగా స్థిరపఱుచుకొనిరి. శివాజీపై యుద్ధమునకుఁ గడంగుటా? లేక క్షమాపత్రము నొసంగి కొన్నికోర్కెలను జెల్లించుటా యను నది రెండవప్రశ్న. ఆలంగీరు ఫాదుషాపైన యుద్ధమెట్టులైనను తప్ప దనియు, శివాజీతోఁగూడ విరోధము పెట్టుకొనినచో నాతని గెలుచుట కష్ట మనియు, శివాజీవనదుర్గప్రాంతములకుఁ బోయి యాయడవులలో వారిని జయించుట దుష్కరమనియు, అందువలన నాతనితో మైత్రి నెఱపుటయే శ్రేయోదాయక మనియు నీలకంఠరాయలు పలికెను. కాని నవాబునకును, మఱి కొందఱుద్యోగులకును ఆమాటలు రుచింపవాయెను. వారు

శివాజీయౌన్నత్య మడఁగించుటకు యుద్ధమే కర్తవ్య మని నిశ్చయించుకొనిరి.

వా రిట్లాలోచించుకొనుచుండఁగానే "దేవుఁడిచ్చినది నేను తీసికొందును." అనుపెద్దయఱపులు వినఁబడియెను.

రాజు తనమిత్త్రుల నింకొకగదిలోనికిఁ బంపి కేకలు వేయునా పిచ్చివానిని గొని రమ్మని యాజ్ఞాపించెను. అప్పటికే యాకేకలు వేయువానిని భటులు కట్టివేయుచుండిరి. రాజాజ్ఞ విని వారు మిక్కిలి యాశపడి యాతనిని లోనికిఁ బోనిచ్చిరి. ఆతఁ డొకఫకీరువలె నుండెను. నవాబును జూచినంతనే మొక్క రింపకుండుట మొదలగునవి చూడ నీతఁడు నాగరకరాజసభ లెన్నఁడును జూచి యుండలే దని స్పష్టమగును. అతఁడు తిన్నగా ఆదిల్‌షాహాకడకు వచ్చి సలాముచేసి యిట్లనెను.

"సార్వభౌమా! ఆలంగీరుపాదుషా యొద్ద విశేష ధనము గొని నిన్నుఁ జంపివైచెద నని ఖానుమహమ్మ దాతనికి వాగ్దాన మొసంగెనఁట! తనయొద్ద శూరులగు భటు లనేకులు లేకుండుటచే నే నుంటినేమో యని చోరపురమునకుఁ గబు రంపెనఁట! నేను నీకు భృత్యుఁడనై తినని పాప మాతఁ డెఱుం గఁడు. నాపుత్త్రుఁడగు గోపాలసింగచట నుండుటచే నాతనితో నిరువదివేలు రూప్యముల నొసంగెద ననియు, నయిదువందల వీరులు తాను జెప్పినకార్యముల నొనరించుటకు మూఁడు దిన ములు కావలె ననియుఁ, జెప్పెనఁట! రానున్న ధనమును పోఁగొట్టుకొనుట మంచిది కా దని యాతఁ డందులకు సమ్మ తించి, భటులను వానిఁ కొసంగి నాకుఁ గబురంపెను. ఆభటులు నే నెట్లు చెప్పిన నట్లు నడుచుకొందురు. రేపటియుదయముననే

సభ దీర్చి ఖానుమహమ్మదు దోషి యని నిరూపించి యేశిక్ష విధింపవలయునో యాలోచనలో నుంచినట్లు చెప్పుము. ఆతఁ డింకను కోటలోనికిఁ జొరకుండఁగనే, నే నాతనిని వధించెదను. ఆతఁడు తనసైనికులచేతనే వధింపఁబడె నని ప్రజ లనుకొను నట్లు నేనేర్పాటు చేసెదను. ఖానుమహమ్మదునకు సఖుఁడుగదా యని అఫ్జుల్‌ఖాను రాజద్రోహి యని తలంపవలదు. ఆతఁడు నీయందు విశ్వాసము గలవారిలో నెల్ల నగ్రగణ్యుఁడు." అని చెప్పఁగా నవా బందులకు సమ్మతించి తనయం దాతనికిఁగల విశ్వాసమునకుఁ గృతజ్ఞత చూపఁదలంచి యుండఁగనే యాతడు వెడలిపోయెను.

## ఎనిమిదవ ప్రకరణము.

### దర్బారు.

బీజపురపుఁ గోటయందలి దర్బారు గృహమును చూడవలయునే కాని వర్ణింప నలవి కాదు. ఆసౌధ మంతయుఁ జలువ రాలచేఁ దాపడము చేయఁబడియుండెను. గోడ లన్నియు వీర రసపూరితములైన బొమ్మలచే నింపివేయఁబడి యుండెను. నేల యంతయుఁ జక్కని తివాసీలతోఁ గప్పఁబడెను. ఆభవనము నకు నడుమ భర్మనిర్మితమగు సింహాసన మమర్పఁబడెను. దాని నాలుగుకోళ్ల క్రిందను నాలుగుసింహము లమరి యుండెను. మిలమిల మెఱసి పోవుచున్న నీలములు వాని కన్నులుగా నమర్పఁబడెను. ఆసింహాసనముపైని శ్వేతవర్ణ సమన్వితము

లగు పట్టు పఱపులు పఱవఁబడి యుండెను. ఇదియే బీజపురపు నవాబధిష్ఠించు సింహాసనము.

గత ప్రకరణమున వివరింపఁబడిన విషయములు జరగిన మఱుచటిదినము ప్రాతఃకాలమున రాజోద్యోగు లందఱకును దర్బారా నాఁటియుదయమునఁ బదిగంటలకుజరగును గాన రావలయు నని యాజ్ఞాపత్రములు పంపఁబడెను. తొమ్మిదిగంటలకు భవన మంతయు నిండిపోయెను. ఉన్నతోద్యోగు లందఱును ధవళవస్త్రములను ధరించిరి కాని వారిభటులుమాత్రము నిగనిగ మెఱయుచున్న పలురంగుల వసనములనుగట్టిరి. సరిగాఁ బదిగంటలకు రాజోచితాలంకారముల ధరించి ఆదిల్‌షాహా ప్రత్యక్షమాయెను. "బీజపుర సార్వభౌమునకు జయము! ఆలీ ఆదిల్‌షాహానవాబునకు జయము !" అను శబ్దములు మిన్నుముట్టెను. నవాబు సింహాసనాసీనుఁడైనతోడనే మరల జయజయధ్వానము లెసఁగెను. అంతటఁ గార్యదర్శి "సద్దు చేయకుఁడు. నవాబువారు చెప్పునది శ్రద్ధతో నాలకింపుఁడు" అని కేకవైచెను. సభయంతయు నొక్కసారిగా నిశ్శబ్దమాయెను. ప్రతి పౌరునిదృష్టియు నవాబుమొగముపైనఁ బడుచుండెను. నవాబు లేచినంతనే కరతాళధ్వనులు చెలరేఁగెను. అవి యాఁగినపిదప నాతఁడీక్రిందివిధమున నుపన్యసింపఁదొడఁగెను.

"రాజభక్తులగు బీజపురపౌరులారా ! నేఁడు మీ కొక యశుభవార్త నెఱిఁగించుట కిచటికి రావించితిమి. పాలకడవయం దొక్క విషబిందువు పడినచో క్షీర మంతయుఁ బాడైపోవునుగదా! అట్లే రాజ్యమున రాజద్రోహి యొకఁ డున్నచో ప్రజలు త్వరగానే చెడిపోవుదురు. రాజభక్తి వారి నెప్పు డెడఁ

బాయునో వారిస్వాతంత్ర్యము నప్పుడే యడుగంటును. స్వాతంత్ర్య మెప్పుడు నూయమగునో బానిసతన మప్పుడే సంభవించును. బానిసతన మెప్పుడు తలచూపునో ధనమాన ప్రాణముల కప్పుడే భంగము కలుగును. (సభలో 'వినుఁడు— వినుఁడు' అను కేకలు). కావున మీరు రాజద్రోహుల సహవాసము చేయరాదు. అట్టివారి చెంతకుఁ బోయి వారితో మాటలాడరాదు. ప్రధానమంత్రి తప్పుడుమార్గములయందు సంచరించుచున్నట్లు తెలియవచ్చినది. తెలియవచ్చిన దన నేల? నిశ్చయమైనది. ఇప్పుడు మేము చదువఁబోవు లేఖవలన నాతఁడు రాజద్రోహి యని తెల్లమగును."

అని యాతఁడు వెనుకటి లేఖను జదివి వినిపించి దాని యందలి సంతకమును బరీక్షించుటకు ముఖ్యులకడకు దాని నొక భటునిచేఁ బంపి యటుపయి నిట్లు చెప్పఁబూనెను.

"దైవవశమున మాకీలేఖ లభించినది. మీ కెవరి కైన నీతఁడు రాజద్రోహి కాఁడని సందేహము కలదా? ('లేదు—లేదు' అని కొందఱఱచిరి. కొందఱు నిశ్శబ్దముగా నూరకుండిరి.) రాజద్రోహికి మరణదండనయే విధింపఁబడి యున్నది. కాని యాతఁడు మహాజనకుని దయను సంపాదించు కొని యీరాజ్యమునఁ జాలఁగాలము పనిచేసెను. కానియాతని కేశిక్ష విధింప వలయునో నేఁటి సాయంకాలము నాల్గుగంటల లోపున నాలోచించుకొని రండు. మేముగూడ దీని విషయమున బాగుగ యోజింతుము. నాల్గుగంటలకు మరలఁ గొలువు దీర్పఁ బడును." అని చెప్పి కూర్చుండెను. అంతఁ గార్యదక్షు లేచి ఖానుమహమ్మదు రాజద్రోహి యైనను, మహారాజు దయార్ద్ర

హ్రృదయుఁ డగుటచే నాతనికి మరణదండనము విధింపనిష్టపడ లే దని చెప్పెను.

అతఁ డింక నేదియో చెప్పుచుండఁగనే పెక్కు గుఱ్ఱములటకటక ధ్వనులు వారిచెవులఁ బడియెను. ఆగుఱ్ఱపుదళ మెవరిదో కనుఁగొనుట కొక భటుని బంప నది ఖాన్ మహమ్మదుదే యని తెలిసెను. ఈ మాట యాలించిన తోడనే యాసభలోఁ బెద్దకలకలము పుట్టెను. కొందఱు శూరులు తమ ఖడ్గములను ఒరలనుండి తీయుచుండిరి. కొందఱు సింహద్వార మువంకకుఁ బోవుచుండిరి. ఖాన్ మహమ్మదు ప్రధాన మంత్రి యగుటచేతను, రాజద్రోహి యని యెవ్వరికిని దెలియకుండుట చేతను పురమును ప్రవేశించుట కాతని నెవ్వరు నడ్డుపెట్టరైరి. అఫ్జుల్ ఖాను మొదలగు కొందఱు వీరులు రాజుచుట్టును వలయాకారముగా నిలిచియుండిరి. అంతట ఖాన్ మహమ్మదు దర్బారుగృహపు సింహద్వారముకడకు వచ్చెను. అచ్చట గొప్ప కలకలము పుట్టెను. సైనికు లందఱును గుమిగా నొకచోటఁ గూడిరి. ద్వారముకడ నున్న ఫకీ రొకఁడు ధవళాశ్వము నెక్కియున్న ఖాన్ మహమ్మదును తన ఖడ్గముతోఁ బొడిచి చంపివైచి యెటకో పాఱిపోయె ననియు, ప్రధానమంత్రితోడ వచ్చిన సైనికు లది యంతయుఁ జూచియు ఫకీరును పట్టుకొనుటకుఁ బ్రయత్నింపలే దనియు నాసభ్యులు చెప్పుకొన మొదలిడిరి. ఫకీరు ఖాన్ మహమ్మదును జంపివైచె నని త్వరగాఁ దెలియకుండుటకై యాశ్వికు లాతని చుట్టును మూఁగి యాతఁ డెవ్వరికిని గనుపడకుండునట్లు చేసి రనియుఁ గూడఁ జెప్పుకొనసాగిరి. ఈకార్య మైన పిదప నాశ్వికులు తమ గుఱ్ఱములతోఁ గూడ

వాయువేగమున నెటకో పోయిరి. ఖాన్ మహమ్మదు హత్యకై కొందఱు విచారించిరి గాని ఘాతుకులను కనుఁగొనుట వారికి దుశ్శక మాయెను. అతని యాశ్రీకులలోనే యంతఃకలహ ములు బయలు దేఱుటచేఁ బ్రధానుని వారే చంపి రనువదంతి యెల్లెడల వ్యాపింపఁజొచ్చెను. దర్బారు నాఁటి కాపివైచి రని కార్య దర్శి తెలిపినతోడనే సభ్యు లందఱును గృహోన్ముఖులైరి.

సాయంకాలమున సరిగా నాల్గుగంటలకు మరల దర్బారు ప్రారంభమాయెను. ఇంతవఱకును నవాబుపైనఁ గుట్రలు పన్నుచున్నవారు కొందఱు కలరు గాని వారినాయకుఁడు మర ణించుటచే నవాబునకుఁ బ్రతిపక్షులుగా నుండుట క్షేమ కరము గాదని వారు మరల రాజభక్తులవలె నటింపఁ బ్రారం భించిరి. నవాబు సింహాసన మెక్కినపుడు జయజయశబ్దము లును కరతాళధ్వనులును చెలరేఁగెను. అవి యన్నియు శాంతిం చినపిదప నవాబు లేచి ఖాన్ మహమ్మదుతప్పిదము లన్నియు నాతనిశరీరముతోనే యంత మొందె నని చెప్పి యాతని యాత్మశాంతికై భగవంతుని బ్రార్థించెను. నవాబుయొక్క క్షమాభావమునకు సభ్యులందఱును ముగ్ధులైపోయిరి. ఇదియే శాంతియందుఁగల మాహాత్మ్యము.

దైవప్రార్థన మైనపిదపఁ దమసామంతరాజగు శివాజీ యొక్క ద్రోహబుద్ధిని నవాబు వ్యక్తీకరించెను. మహాశౌర్య సంపన్నుఁడును, రాజకార్యధురంధరుఁడు నగు శివాజీభాఁస్లే వంటివానిని జయింపకున్నచో రాజ్యమున కెక్కువ యనర్థము గలుగు నని చెప్పెను. మహారాజమ్మదు మధురగంభీరభాష ణములచే సభ్యులమనములు ద్రవీభూతములైపోయెను. మహా

రాష్ట్రుల నణఁగఁ ద్రొక్కవలె ననెడి యుద్దేశము ప్రతివాని మానసమందు నుదయించెను. ఆ సభయం దట్టికోర్కి విశేష ముగ లేనివా రిరువురుమాత్రమే కలరు. అం దొకఁడు నీల కంఠరాయలు. రెండవవాఁడు ఫెజిల్‌ఖాను. ఫెజిల్‌ఖాను మహ మ్మదీయ సంప్రదాయమునకు బద్ధుఁడైనను శివాజీయొక్క శౌర్యధైర్యములను సద్గుణపుంజమును పలుమాఱు లాలకించు టచే నాతనియం దొకవిధమగు భక్తికలిగి యుండెను. కాని యాతఁడు బీజపుర రాజ్యవిరోధియగుటచే నాతనితో యుద్ధముఁ జేయుటకు ఫెజిల్‌ఖాను వెనుదీయుటలేదు. నీలకంఠరాయలు కూడ నట్టివాఁడే. వారు సంధి పొసఁగిన బాగుగ నుండు నని తలంచిరి గాని యది యసంభవ మని వారికిఁ దెలియును.

ఇది యిట్లుండ నవాబు వజ్రస్థగితమై ధగధగ మెఱ యుచున్న కత్తి నొకపళ్లెరమునఁ బెట్టి, "శివాజీని ప్రాణముల తోఁగాని చంపివైచికాని యెవరు గొనివత్తురో వారీకరవాల మును తీసికొనవచ్చును." అని చెప్పెను. సభయం దంతటను గొప్పసంచలనము పుట్టెను. ఒకరితో నొకరు గుసగుస లాడు కొనఁజొచ్చిరి. కాని యెక్కఁడైనను ముందునకు రాఁడా యెను. అంతట వృద్ధుఁడైన అఫ్జుల్‌ఖాను ముందఱకు వచ్చి మేఘగంభీర భాషణముల నిట్లనియెను. "మూఁడుమాసములు దాఁటులోపల నే నాకొండయెలుకను బట్టి తెచ్చెద నని యీ కత్తి ముట్టి ప్రతినఁ జేయుచున్నాను." అని చెప్పి యాఖడ్గ మును చేకొని పైకెత్తెను. "అఫ్జుల్‌ఖానునకు జయము" అను శబ్దములు నింగిముట్టెను. నవాబు తనమెడయం దున్నముత్యా

లహారము నాతనిమెడయం దలంకరించి యాతని నెంతయో వినుతించెను. జయజయధ్వానములతో సభ ముగిసెను.

దర్బారు జయప్రదముగా ముగిసిన పిదప, అఫ్జల్‌ఖాను గృహమునకుఁ బోయి తన చక్రరక్షకులతోడఁ గొంతసేపు తాము చేయవలసిన కార్యమును గూర్చి యోజించి స్నానభోజనాదులను గావించి తాంబూలచర్వణముఁ జేయుచు గృహాంగణమునఁ బడుకకుర్చీపైనఁ గూర్చుండియుండెను. అప్పుడాజానుబాహుఁడగు ఫకీరొకఁడాతనికడకు వచ్చెను. ఆతనిఁ జూచి ఖాను మిక్కిలి యాశ్చర్యపడెను. ఆతఁడొక ప్రచ్ఛన్నవీరపురుషుఁడని ఖాను గ్రహించెను. ఆఫకీరు తనదుస్తులలోనుండి రక్తసిక్తమైన యొకకృపాణమును దీసి యాతనిముందు పడవైచెను. అది యేమి యని ఖాను ప్రశ్నించెను. ఫకీరు-తాను పహార్‌సింగు నని తెలిపి, తాను నవాబును ప్రథమమునఁ జూచినది మొదలప్పటివఱకును తా నొనరించిన దంతయు నాతనికి నివేదించెను. అఫ్జల్‌ఖానునకుఁ బహార్‌సింగుపైన ద్వేషమున్నను రాజ్యరక్షణమునకై యాతనితో స్నేహము చేయవలసివచ్చెను. పహార్‌సింగుకోరికపై నాతని పూర్వవైరమును దలంపక తనయుద్ధయాత్రయం దాతనిని భాగస్వామిగాఁ జేసికొనుట కంగీకరించెను. తరువాతను పహార్‌సింగు, అఫ్జల్‌ఖానుకడ సెలవుగొని వెడలిపోయెను.

# తొమ్మిదవ ప్రకరణము.

## శివాజీయనుచరులు.

ద్వంద్వయుద్ధమున బలవంతరావు నేలఁ బడినపిదపఁ దానాజీమాల్సురే తనయనుచరు నొకమిత్త్రునియింట నిలిపి తాను రాజమతగురుని వేషమును ధరించి యారాత్రియే పురము వీడిపోయెను. పహాడ్సిం గాతనిని పట్టుకొనుట కనేక ప్రయత్నములు చేసెను గాని పురము దాఁటినదనుక నాతనిని గనిపట్టలేకపోయెను. అశ్వారూఢుఁడై పోవుచున్న యాతనిని కంఠధ్వనివలన ననుమానించి వెంటఁబడెను గాని మోసపుచ్చి తానాజీమాల్సురే తులజాపురమువంకకు వాయువేగమునఁ బోయెను. ఆనాఁడు పార్వతీకల్యాణదిన మగుటచే నచటికి సమారమి ముప్పదివేలు జనులు వచ్చిరి.

తానాజీ యానాఁటి యుదయమున నాలు గంటలకుఁ జాపురముఁ జేరెను. ఆనాఁ డుత్సవదిన మగుటచే ననేక యాత్రికు లచటికి వచ్చిరి. అతఁడు స్నానసంధ్యాదికృత్యములం దీర్చుకొని శ్రీదేవ్యాలయమువంక కరుగుచుండెను. మోరోపంతు తానాజీని జూచినంతనే యాతనిని తన గృహమునకుఁ గొనిపోయి శ్రోత్రియబ్రాహ్మణ వేషధారణమునకు దగినపరికరముల నొసంగెను.

ఒక గంటలో వారిరువురును దేవ్యాలయమునకుఁ జేరిరి. అప్పటికే యనేకు లచట గుమిగూడి యుండిరి. తానాజీమోరోపంతు లర్చకులతోఁగూడి దేవికిఁ బ్రియమగు వేదమంత్రములను పఠింప మొదలిడిరి. అందు వీరికిఁగల సామర్థ్యమునకు యాత్రికు

లందఱును మిక్కిలి యాశ్చర్యపడిరి. దేవీకల్యాణ మైన పిదప గొప్పసంతర్పణము జరిగెను. సరిగాఁ దొమ్మిది గంటలకు గర్భాలయమున నిరువదివేలమంది మహారాష్ట్రులు గొప్పసభ గావించిరి. మోరోపంతు, తానాజీమాల్సురే నగ్రాసనముపై గూర్చుండఁజేసి, ఆతనిని సభ్యుల కెఱుకపఱచి యాతఁడు చెప్పు మాటలను శ్రద్ధతో నాలకింపుఁ డని కోరెను. సభయంతయు నిశ్శబ్ద మాయెను. తానాజీమాల్సురే యుపన్యాస వేదికపై నిలిచి యీ క్రిందివిధమున గంభీరోపన్యాస మొసఁగెను.

"భారతీయసోదర సోదరీమణులారా! నల హరిశ్చంద్రాది సార్వభౌములయందు నున్నపుడు సమస్త సౌఖ్యముల నోలలాడిన మనహైందవులకు నేఁడు తీరనియిక్కట్లు గలిగెను. సిరిసంపదల కాకరమైన మనభారతీదేశమున నేఁడు దారిద్ర్య దేవత తాండవ మాడుచున్నది. దివ్యాంబరముల తోడను నవరత్నఖచితభూషణములతోడనుతులఁదూగుచుండెడి భారతమాత నేఁడు కట్ట గుడ్డయైన లేక యాఁకలిచే మలమల మాడుచున్నది. బిడ్డలదైన్యస్థితిని గాంచి కంటికిని మంటికి నాత ధారగా నేడ్చుచున్నది. మాతదారిద్ర్యస్థితిని దలఁచిన మీగుండెలు వ్రీలుటలేదా? మీశరీరము బాష్పధారలచే నిండిపోవుట లేదా? కన్నతల్లికష్టములఁ బాపఁజాలనిపుత్త్రుఁ డున్న నేమి? లేకున్న నేమి? దేశమాత నిట్టిదశయం దుంచుట తగదు. మన మందఱమును తలఁచినచో యవనరాజ్య మొక్కక్షణమున భస్మీభూతము కాఁగలదు. మతమును మంటఁ గలిపి, వేదములను మటుమాయము గావించి, భక్తిని పాఱఁద్రోలఁ బ్రతిన గావించిన యీతురుష్క రాజ్యము మనకేల? స్త్రీలపై

గాని, న్యాయైకశీలు రగుయవనులపైఁగాని మనము కత్తి గట్టవలదు. బీజపుర ఢిల్లీ సామ్రాజ్యములను మాత్రము మనము నేలమట్టము గావింపవలయును. మనదురదృష్టవశమున న్యాయస్థాపకు లగు ప్రతాపసింహాదిసార్వభౌములు పోయి, ఆలంగీరు, ఆదిల్‌షాహాలవంటి క్రూరపరిపాలకులు మనకు సంభవించిరి. అందుచేత మన మందఱ మేకమై యీయవనరాజ్యములను నాశముచేయవలయును. ఇట్టి ఘన కార్యమున మనకు నాయకుఁ డెవ రని మీ రడుగవచ్చును. లోకైకవీరుఁడును, సుగుణఖనియు, మహమ్మదీయసార్వభౌములకుఁ బ్రక్కలోని బల్లెమునైన శ్రీ శివాజీభాన్స్లేమహారాజు కలఁడుగదా! అతఁ డిదివఱకే యవనుల ననేక యుద్ధరంగములందు జయించి జగద్విఖ్యాత కీర్తిఁ గాంచెను. న్యాయస్థాపనార్థముగా మహిషాసురమర్దని యగు మనజననియే శివాజీమహారాజై యీ భూమిపైన నవతరించినది. అట్లే కానిచో వేలకొలఁది యవనులను తనస్వల్పసైన్యము సహాయముగా నెవ్వఁడైన జయింపగలఁడా? ఆతనిఁ జూచినవా రందఱు సాక్షాద్భగవత్స్వరూపుఁ డని తలంపకమానరు. యుద్ధములం దాతఁడు గైకొనినధనములోని దొక్కకాసైనను స్వతంత్రించి వెచ్చింపఁడే! అది యంతయు గురుదేవుని పేరుగా యవనరాజ్యనిర్మూలనమున కుపయోగించునఁట! ఆహా! ఏమి యాతని స్వార్థత్యాగము! అట్టి మహానుభావుఁడు తనప్రాణముల రెంటిని దేశోపకారమునకై యుపయోగించుచుండ మనకొంట్లీతుచ్ఛప్రాణములపై నాసను వీడఁజాలక దేశమును విపత్సముద్రమున ముంచుటయెంతసిగ్గు? (సిగ్గు—సిగ్గు—అని సభలోఁ గేకలు)

దేశమును బానిసతనమునుండి తొలగించుటకై మీప్రాణ ములనర్పింప వెఱతురా? (వెఱవము—వెఱము—అని కేకలు) అటులైనచో దేశమాతపిలుపునకై వేచియుండుఁడు. శివాజీమహారాజురణభేరి నాలించినతోడనే యాతని పతాకము క్రిందికి వచ్చి నిలుచుటకు సిద్ధపడియుండుఁడు. దేవియే పురుష రూపమున మసలను నడపించుచుండ మనకు భయమేల? (భయము లేదు—అని కేకలు,) మీరు భారతమాతకు నిజమైనపుత్త్రులైనచో, బానిసతనమునుండి విముక్తి నందుటకుఁ గంకణము గట్టుకొనినచో, శివాజీమహారాజులకుఁ జేయూఁత నొసంగుటకు దృఢనిశ్చయులైనచో "శ్రీశివాజీ మహారాజునకు జయము" అని యొక్క మాటగాఁ గేకవేయుఁడు. (శ్రీశివాజీ మహారాజునకు జయము—హిందూరాజ్యస్థాపన దీక్షాపరులకు జయము—వీరాధివీర బిరుదాంకిత తానాజీమాల్సురేకు జయము అని సభలోనివా రందఱు నొక్కపెట్టున జయజయ ధ్వనుఁ జేసిరి.) ఇప్పుడు మీ రేమియు సాహాయ్యము చేయునవసరం లేదు. అవసరమైనచో మహారాజే మిమ్ములను రావించునని ప్రస్తుతము మీలో శివాజీమహారాజుపక్షమున నుండఁ దలఁచినవారీపత్త్రములపై సంతకములను జేయుఁడు."

అని చెప్పి తానాజీమాల్సురే కూర్చుండెను. మోరోపంతొకపుస్తకమును వారికడకుఁ దీసికొనిపోయి పదునైదు వేలమంది మహారాష్ట్రులచే సంతకములు చేయించెను. వారందఱును హైందవ ధర్మరక్షణార్థము తమప్రాణములను సయితమర్పింతుమని దేవియెదుటఁ బ్రతినఁ జేసిరి. మిగిలిన వారు తాము వీరులము కామనియు, తమకు సాధ్యమగునంతవఱకు

శివాజీమహారాజునకు సాయపడుచుండు మనియుఁ బలికిరి. సభ యిట్లు జయప్రదముగా ముగిసినపిదప శివాజీనామసంకీర్తన లను జేయుచు సభ్యు లందఱును తమతమగృహములకుఁ జనిరి.

తానాజీ అప్పటికి మిక్కిలి యలసియుండెను. అందుచే మోరోపంతు తాతనిని తన నిలయమునకుఁ ద్వరగాఁ గొనిపోయి యతనిని నొకగదిలో శయనింపఁజేసెను.

పిమ్మట మోరోపంతు గంగాబాయియొక్క గృహమున కేఁగెను. అప్పటి కామె భోజనము గావించి వీథియఱుఁగుపైనఁ గూర్చుండియుండెను. వారిరువురు నొకగదిలోనికిఁ బోయి తలుపులు మూసి రహస్యముగ నిట్లు సంభాషించిరి.

మోరో—గంగా! కళావతి నా కబ్బునట్లు చేయకపోతివిగదా!

గంగ—నాసర్వశక్తుల నుపయోగించి చూచితిని గాని నాకు సాధ్యము కాలేదు. ఆమెకు సాంసారిక సుఖములయందు విరక్తి జనించినట్లు గానిపించుచున్నది. ఆమె యెల్లప్పుడును వేదాంతగ్రంథములను చదువుచునే యుండును. ఆమె మనమునందు వైరాగ్యబీజమును నాటిన వా గ్రంథములే.

మోరో—అటులైన దానిపై నాస వీడుకోవలసినదేనా?

గంగ—నీసోదరి నీ కేమియు సాయము చేయలేదా?

మోరో—ఆమె సాధ్యమైనంతవఱకుఁ జేసినది. మోహావిషయములగు సంభాషణములు వచ్చినచో నది వానికి వైరాగ్యముచే మెఱుఁగిడునఁట! ఎటులైనను నేను దానిని గ్రహింపవలయును.

గంగ—సామదానభేదోపాయములలో నేనికిని ఆమె లొంగదు.

మోరో—అటులైనచో దండోపాయముచేతనే దానిని చెట్టఁబట్టవలయును.

గంగ—నీ వొకకాంతను బలాత్కరించితి వని తెలిసినచో శివాజీ మహారాజు ఊరకుండునా ?

విద్యా—తెలిసినచో నూరకుండునా ? తప్పక శిక్షించి తీరును. అబలల కెవ్వ రన్యాయ మొనరించినను ఆతఁడు క్షమింపఁడు.

గంగ—ఆతఁ డేకపత్నీవ్రతుఁడా ?

మోరో—ఆతఁడు మిక్కిలి పవిత్రుఁడు. ఆతనిపై న్యాధిపతి యొకసారి సౌందర్యతిలక మగు నొకయువనకాంతను మహారాజునకుఁ గానుకగా సమర్పించెను. అప్పు డాతఁ డామెకు నమస్కరించి "తల్లీ! నా జనని నీయంత సౌందర్యవతి యైనచో నే నెంతయందగాఁడనై యుందునో" కదా యని చెప్పి యామెను విడిచిపుచ్చి కొన్ని బహుమానముల నొసంగి యామెతలిదండ్రులకడకుఁ బంపివైచెను.

గంగ—మహారాజు జెంతయింద్రియనిగ్రహము గలవాఁడు !

మోరో—అట్టిమహాపురుషుఁడు గనుకనే మహారాష్ట్రు లందఱు నాతని నవతారపురుషునిగా నెంచుచున్నారు.

గంగ—అయినచో నీవు కళావతిని బలాత్కారముగాఁ గొని పోతి వని తెలిసినచో శిక్షింపఁడా ?

మోరో—ఆతనికిఁ దెలియకుండునట్లు నే నేర్పాటు చేసికొందును. అంత తెలిసినచో నెట్లో సమర్థించుకొందును. శిక్షనైనను సంతోషముతో ననుభవింతును గాని కళావతిని

మాత్రము విడువఁజాలను. నేనిచట మూఁడునాల్గురోజులకన్న నెక్కువగా నుండుటకు వీలు లేదు. కావున ఈలోపుననే నే దానిని గొనిపోవున ట్లేర్పాటు చేయుము.

గంగ.—(కొంతదనుక యోచించి) నే నెటులో దేవ్యాలయపశ్చిమద్వారపుఁదాళము చెవిని సంపాదింతును. ఎల్లుండిరాత్రి ప్రదక్షిణము జరుగునపుడు నీసోదరి కళావతికిఁ గానిపించకుండునటు లేర్పాటు చేయుము. ఆసమయమున నే నామె నెటులో మోసము చేసి పశ్చిమద్వారముకడకుఁ గొనివత్తును. అచట నీ వొకపల్లకితోను, బోయీలతోను సిద్ధముగా నుండుము. నే నామెతో నచటికి వచ్చినతోడనే నీ వామెపై నొకకంబళి పడవైచి యామె కేకలు పరులకు వినఁబడకుండునట్లు చేసి పల్లకిలో నెక్కించుము. తలు పవతలవైపు తాళము వేసి మనము వెడలిపోవుదము. ఇది నీకు సమ్మతమా ?

మోహో—గంగా ! నీబుద్ధిచాతుర్య మనుపమానము. నీవలనఁ గళావతి నాయధీన మైనచో నేను నీకు వాగ్దానము చేసిన ధనముకన్న నెక్కువ యొసంగి నిన్ను సంతోసింపఁ జేసెదను.

గంగ—నీ వన్ని యేర్పాటులును సరిగాఁ జేసినచో జయము తప్పక చేకూరును.

మోహో—సరియే. నీకార్యమున నీ వుండుము. నేను పోయెదను - అని చెప్పి మోహోపంతు గృహోన్ముఖుఁ డాయెను.

## పదియవ ప్రకరణము.

### తులజాపురము ముట్టడి.

అఫ్జుల్‌ఖాను తనమందిరమునఁ గూర్చుండి యుద్ధయాత్ర నెట్లు జరపవలెనో యోజించుచుండఁ బహార్‌సింగచటికి వచ్చెను. తానాజీమాల్సురే తులజాపురమునకుఁ బోయి పదునైదువేలమంది మహారాష్ట్రులను శివాజీపక్షమునఁ జేర్చె ననియు వారందఱును తులజాపుర మింకను వదల లేదనియుఁ జారులవలనఁ దెలిసికొంటి నని పహార్‌సింగఫ్జుల్‌ఖానుతోఁ జెప్పెను. వారినామము లన్నియు వ్రాసియున్న కాగితముల నొసంగి, తులజాపురమును ముట్టడించి వారి నందఱను పట్టుకొనవలయు నని, చోరనాయకుఁడు సలహా యిచ్చెను. ముప్పదివేలమంది మహారాష్ట్రులచే నిండియున్న పురమును [illegible] కొనుట మిక్కిలి కష్ట మనియుఁ బ్రాణనష్టము విస్తారప కలుగు ననియు అఫ్జుల్‌ఖాను శంకించెను. రాత్రిసమయమున నొక్కసారి పురమును ముట్టడించి యందలిజనులను భయపెట్టినచో రాజద్రోహుల నందఱ నొక్కసారిగాఁ బట్టుకొనవచ్చు ననియు, ఇట్టితెరుణము మించినచో ద్రోహు లందఱ నొక్కసారి పట్టుకొనుట యసాధ్య మనియుఁ బహార్‌సింగాతనికి బోధించి యెట్టకేల కామఱుచటినాఁటిరాత్రి తులజాపురము ముట్టడించుట కఫ్జుల్‌ఖానునుసమ్మతింపఁజేసెను. ప్రాగ్ద్వారము నఫ్జుల్‌ఖాను కొంతసైన్యముతో ముట్టడించుటకును, పశ్చిమద్వారమును ఫెజిల్‌ఖానుపహార్‌సింగులు కొంతసైన్యముతో నరికట్టుటకును ఏర్పాటు చేసికొనిరి.

# పదియవ ప్రకరణ

ఆమఱునాఁటిరాత్రి రమారమి పదుఁ దులజామాత ప్రదక్షిణమునకు బయలుదేఱెను. నాదేవిపల్లకివెనుక నడచుచుండిరి. అట్టిసమయమున నాలుగైదు తుపాకీశబ్దములు వినఁబడెను. కొందఱు ద్వారముకడకుఁ బోయి చూచునప్పటికి యవనసైనికులాలయమునఁ బ్రవేశించుచుండిరి. ఈవార్త ప్రజలందఱకు నొక్కక్షణములోఁ దెలిసిపోయెను. ఎవరికి దొరకిన యాయుధములను వారు గ్రహించి యుద్ధమునకు సిద్ధపడిరి. రాజద్రోహులను తమయధీనము చేసినచో మిగిలినవారితలపూవైనను వాడకుండ విడిచివైచెద మని యఫ్ఝుల్‌ఖా నఱచుచుండెను. కాని యాతనికెవ్వరును సరియైన సమాధాన మొసంగలేదు. ప్రాణము ంతవఱకు నాలయమును గాపాడవలయు నని యెల్లరును ఢనిశ్చయులైరి. ప్రతివారును శివాజీమహారాజున కేది నాయొకవిధమున సాహాయ్యము చేయుచుండుటచేఁ దాము రాజద్రోహులుగాఁ బరిగణింపఁబడుదుమేమో యని యెవ్వరును అఫ్ఝుల్‌ఖానుతో సంధి కొడంబడరైరి. వ్యాసశాస్త్రి తనకుఁ జిన్నతనమునఁ గత్తిసామునందుఁగల సామర్థ్యమును లంచి తనచేతికత్తిచే నొకయవనుని బడవైచి వానికడ నున్న లమును బలవంతముగ లాగికొని తురుష్కులయాలయ ప్ర...మున కడ్డుపెట్ట యత్నించెను. మిగిలినమహారాష్ట్రులనేకు లాతని ననుసరించిరి. అఫ్ఝుల్‌ఖానున కిఁక యుద్ధము తప్పినది గాదు. ఇట్లు జరగు నని యాతఁడు తలంపలేదు. రణమ్మొనర్చెద మని భయపెట్టినచో దేవ్యాలయధర్మకర్త ద్రోహులను తమయధీనము చేయు నని యాతఁ డూహించెను.

మహారాష్ట్రవీరులు తమ్మునడ్డగించినతోడనే యవనసైనికులు వారిని ఖండఖండములుగాఁ జెండివేయ మొదలిడిరి. ఎంత ధైర్యవంతు లైనను యుద్ధమునకు సిద్ధపడి వచ్చినవీరులతో నెట్లు పోరాడఁగలరు? శత్రువీరులు సర్వాయుధసమన్వితులై కవచములను ధరించియుండుటచే మహారాష్ట్రుల ప్రహారములు వారి నంత బాధించుటలేదు. కవచవిరహితులును, ఆయుధరహితులు నగుయాత్రికు లనేకులు తురుష్కఖడ్గములకుఁ బాలయిరి. వ్యాసశాస్త్రి యప్రతిమానప్రతాపశాలియై కొంతసేపు రణ మొనర్చి మువ్వురు శాత్రవవీరులను జంపెను గాని తుదకొకయవనుని కృపాణఘాతముచే నేలఁబడియెను. కొలఁదినిమిషములలో నాలయ మంతయుఁ బీనుఁగులపెంట యయ్యెను. కొలఁదినిమిషములక్రిందట భక్తిరసముచే దేలుచుండిన ప్రదేశ మిపుడు రక్తప్రవాహముచే నిండిపోయెను. వ్యాసశాస్త్రి మరణించె ననువార్త యెల్లెడల వ్యాపించెను. అతని ప్రియమిత్రుఁడగు జానకీరాముఁడు, రాధను, ఆనందాబాయి నొకరహస్యస్థలమున దాఁచియుంచెను. తమప్రేమాస్పదులను గోల్పోవుటచే వారు విషాదసాగరనిమగ్నులై కంటికి నిద్రయైన లేక యారాత్రి యంతయు నా ప్రదేశముననే యుండిపోయిరి.

ద్వారమునఁ దుములయుద్ధము జరుగుచున్నపుడు గంగాబాయి కళావతికడకుఁ బోయి యామెను రక్షించెద నని చెప్పి పశ్చిమ ద్వారముకడకు లాగికొని పోయెను. ఆ ప్రక్కను నక్కియున్న మోహనపంతు కళావతిపై దట్టమగు నొకకంబళిని బడవైచి యామెయార్తరవ మెవ్వరికిని వినఁబడకుండునట్లామెనోరు గట్టిగా మూసివైచెను. పిమ్మట గంగాబాయి యాద్వారమును

దెలిపెను. వారు ముప్వురు నావలకుఁ బోయిన పిదప మోరో పంతు కళావతిని తాను సిద్ధపఱిచిన పల్లకియం దుంచి తలుపులు మూసివైచెను. బోయీలను గంగాబాయిని విద్యానగరమువంకకు నడవుఁడని చెప్పి తాను సమరము సంకులముగా జరగుచున్న చోటికిఁ బోదలంచెను. కాని యచటిపరిస్థితి నంతను గంగాబాయి యాతని కెఱింగించి తమతోడ నాతని గూడఁ గొనిపోయెను. ముందు గుఱ్ఱముపై మోరోపంతు, ఆతని ప్రక్కను గంగాబాయియు, వారివెనుకఁ బల్లకిని మోయుచున్న బోయీలునుపోవుచుండిరి. దేవాలయమున నున్నవృద్ధులును, స్త్రీలును పశ్చిమద్వారము వెంటఁ బోవలయు నని యత్నించిరి గాని యది గంగాబాయిచే నదివఱకే బంధింపఁ బడెను. మోరోపంతు తనయనుచరులతోఁగూడ నాలయోద్యానాంతమునకు వచ్చినతోడనే యచటిపొదలలో దాగియున్న నలువురు వీరు లాతనిపైఁ బడి యాతనిని బంధించివైచిరి. ఖడ్గవిద్యయం దసమానపాండిత్యము గలిగి యున్నను ఏమఱుపాటునఁ బైఁబడిన నలువురు శూరుల నెట్లు జయింపఁగలఁడు? అందు బలవంతుఁడగు రాజపుత్రుఁ డొకఁడు తనకడ నున్న చేదీపపుఁ గాంతిచే నామహారాష్ట్రుని పరీక్షించి, ఓహో! మోరోపండితుఁడా! వెదకఁబోయినతీగ కాళ్లకుఁ జుట్టుకొనినదే!" అని కేక వైచెను. యువకుఁడగు ముసల్మాను వీరుఁ డొకఁ డచటకి వచ్చి మోరోపంతును బాగుగఁ బరీక్షించెను. అందుఁ బ్రథముఁడు పహార్‌సింగనియు, ద్వితీయుఁడు ఫెజిల్‌ఖాననియు మోరోపం తెఱింగును. రాజపుత్ర వీరుఁడు మహా

రాష్ట్రుని వంకకుఁ దిరిగి, "మోరోపంతూ ! నీప్రక్కను వచ్చిన కాంత యెవరు ?—అని ప్రశ్నించెను.

మోరో—ఆమె దేవ్యాలయార్చకురాండ్రలో నొకతె.

పహర్—నీతో నేల వచ్చుచున్నది ?

మోరో—నీ కది యంతయు నే నేల చెప్పవలయును ?

పహర్—నీవు నాకు లోఁబడితివి గనుక.

మోరో—లోఁబడితి నని యెవ రనిరి ?

పహర్—విధి.

మోరో—అట్లయినచో నీ ప్రశ్నములకుఁగూడ నా విధియే ప్రత్యుత్తర మిచ్చును.

పహర్—ఇది యేయూరి సింగము ? ఎంత వేగిరపాటుతో నున్నది !

మోరో—సింహబిరుదాంకితుఁడ వగునీవు గ్రామవాసి వోట గ్రామసింహమ వైతివి.

పహర్—అబలలవలె వాగ్వాదమును బాగుగా నేర్చితివే ?

మోరో—నీవు నేర్పిన విద్యయే కదా !

పహర్—కోఱ లూడినను త్రాఁచు బుసకొట్టుచునే యుండును. నీచేతులను కాగడాలుగా మార్చినపుడు నీనోటనుండి సత్యము వెలువడును.

ఫెజల్—పహర్ సింహా! ఊరకుండుము. (మహారాష్ట్రునివంకకుఁ దిరిగి) మోరోపంతూ ! అబలలతో మేము యుద్ధము చేయువారము కాము. ఈ కాంత యెవరో, ఆ పల్లకిలో నున్న దెవరో నిజము మా కెఱింగించినచో వారిని వారి తావులకుఁ బంపివైచెదము.

మోరో—అట్లడిగినచో నే నేల సమాధానము చెప్పను ? ఇదియే శివాజీమహామహుఁడు కాంతలయెడఁ జూపుపద్ధతి. ఈవనిత లెవరో చెప్పెద నాలకింపుము. నా ప్రక్కనుభయ ముచే వడఁకుచున్న యీమెనామము గంగాబాయి. ఈమె యర్చకురా లని చెప్పితినిగదా! ఆపల్లకియం దున్నయీమె నాభార్య—

పహార్—మమ్ము మోసపుచ్చఁ దలంచినచో నిన్ను ఖండఖండ ములుగాఁ జెండివైచెదము. నీవు మొన్న మొన్నటివఱకును బ్రహ్మచారివిగదా ! నీ కింతలోనే వివాహ మాయెనా ? పల్లకిలోని కాంత నీజాయ కానేరదు.

రో—నీ కెట్లు తెలియును ?

ర్—(ఫెజిల్ ఖానువంకకుఁ దిరిగి) ఈమూర్ఖుఁ డెన్నఁటికిని సత్య మెఱిఁగింపఁడు. ఆప్లకిలోని స్త్రీ నడిగినచో నన్నియుఁ దెలియును.

అంతవఱకును వారి సంభాషణము నాలకించుచు నిశ్చే ష్టితురాలై యున్న కళావతి పల్లకినుండి వెలువడి తాను వ్యాస శాస్త్రికొమార్తెననియుఁ, దన్ను బలవంతముగ గంగాబాయి, మోరోపంతును గొనివచ్చి రనియుఁ దన్నెటు లైనను తండ్రి కడకుఁ బంపుఁడనియును ఫెజిల్ ఖాను-పహార్ సింగులను వేఁడు కొనెను. ఆమె సౌందర్యాతిశయముచేతను వాక్చాతుర్యము చేతను ఫెజిల్ ఖాను ముగ్ధుఁ డైపోయెను. ఆమె రూపము నందుఁగల శాంతరససమన్వితమగు బ్రహ్మతేజమును తనివారఁ గ్రోలుచు నాతఁడు కొంతసే పట్లే నిలిచిపోయెను. ఆమెయం దాతని కపారకరుణ యుదయించెను. ఆలయమునం దల్లరి తగ్గిన

పిదప నామెను జనకునింటికిఁ బంపెద ననియు, అంతవఱకును తన గుడారమునఁ దనసోదరికడ నుండు మనియు నామెతోఁ జెప్పెను. కళావతి కేలొకో కాని యాతనియెడ నమ్మక ముదయించుటచే నందులకు సమ్మతించెను. ఫెజిల్‌ఖా నిరువురు భటులను తోడిచ్చి గంగా కళావతులను తనసోదరియున్న గుడారమునకుఁ బంపెను.

అంతట నఫ్ఝల్‌ఖాను తనసైనికులతోడను, కొందఱు బందీలతోడను అచటికి వచ్చెను. ఆలయమున సంకులసమరము జరిగెననియు, నందనేకులు మరణించి రనియు నఫ్ఝల్‌ఖాను తనయునితోఁ జెప్పెను. నిష్కారణముగా హత్యలు జరిగినందులకు ఫెజిల్‌ఖాను మిక్కిలి విచారించెను. పిదప వ్యాసశాస్త్రి కుటుంబమువారిని వెదకుటకొక భటునిబంపెను. వ్యాసశాస్త్రి మరణించెననియు, రాధానంద లెవ్వరికిని కనఁబడుట లేదనియు నాతఁడు కనుఁగొనెను. ఈ శోకవార్త మెల్లఁగఁ గళావతి కెఱుకపఱచి యామె తన సోదరితో నివసించునటు లేర్పాటు చేసెను. జైనా కళావతుల కచిరకాలముననే యత్యంతమైత్త్రి గలిగెను.

ఇది యిట్లుండ శివాజీకడనుండి యఫ్ఝల్‌ఖానునికడకు రాయబారులు వచ్చుచుండిరి. బీజపురపు నవాబుతోడఁ దనకు వైరము పెట్టుకొనుట శ్రేయోదాయకము కాదనియు, అందుచే దాను ఖాను చెప్పిన షరతులకు సమ్మతింతు ననియు శివాజీ యాతనికి వ్రాసియుండెను. మహారాష్ట్రుల యుద్ధ ప్రయత్నములను మోరోపంతువలన గ్రహింపవలయు నని యాతని నెంత ప్రశ్నించినను లాభకారి కాకపోయెను. కళావతి నేల కొని

పోవుచుంటి వని ఖాను ప్రశ్నించినపుడు, తన సోదరియు వ్యాస శాస్త్రి రెండవ భార్యయు నగురాధకును, కళావతికిని గృహకలహములు కలుగుచుండుటచే విద్యానగరమునందలి దేవాలయమున నర్చకురాలుగాఁ జేర్చుటకు వ్యాసశాస్త్రియనుజ్ఞపైఁ గొనిపోవుచుంటి నని మోరోపంతు చెప్పెను. సంధి జరగనున్న సమయమునఁ బ్రతిపక్షపీరు నొకనిని బందీగా నుంచుట సమంజసము కాదని ఖాను మోరోపంతును వదలివై చెను. తులజాపురమునఁ బట్టుకొనిన ఖైదీల నేల విడువరాదని మనము సందేహింపరాదు. వారందఱును బీజపురరాజ్యరులు గాని శివాజీరాజ్యమునం దుండువారు కారనిమనము పియుందుంచుకొనవలయును.

## పదునొకండవ ప్రకరణము.

### కళావతి కష్టములు.

మోరో ంతు, నిర్బంధమునునుండి విడివడినతోడనే గంగాబాయిని వెదకి కనుఁగొనెను. వారిరువురును మరలఁ గళావతిని బట్టుకొనుటకు విశ్వప్రయత్నములఁ జేయ మొదలిడిరి. శివాజీ అదిల్‌షాహాల కింకను సంధి కుదురక పోవుటచేత నప్జుల్‌ఖాను తనసైన్యమును దీసికొని మహారాష్ట్ర రాజ్యములపైఁ బోవ సంసిద్ధుఁడై యుండెను. ఇది మోరోపంతు తెల్లో తెలిసికొని తనసైనికులలో నిరువదిమందికి యవనసైనిక వేషముల నమర్చి తా నొకతురుష్క సేనాధిపతివేషమును దాల్చెను. ఆనాఁటియుదయమున నప్జుల్‌ఖాను తనసేనలతోఁ

కూడ బయలుదేఱి రాత్రి యేడుగంటల కొకలోయకడకు వచ్చెను. ఆలోయ దాఁటినపిదప నాల్గుమైళ్లదూరమున నొకపల్లె కలదు. అందు విడియుఁదలఁచి ఖాను తనసైనికులకు వడిగా నడవుఁ డని యాజ్ఞాపించెను. అప్పుడు తమకు శత్రుభయము లే దని తలంచి వారు బారులనుండి చెదరిపోయి, తైర్థికులవలె గుంపులు గుంపులుగా నాలోయనుండి నడవమొదలిడిరి. అఫ్జుల్ ఖాను రెండవభార్యయు, జైనాకళావతులును పల్లకులలో నెక్కి సైన్యము వెనుకభాగముననుండి వచ్చుచుండిరి.

అంతవఱకును యవనులకుఁ దెలియకుండున ట్లాలోయకు సమీపమునఁ బొదలమాటున దాఁగియున్న మోరోపంతు యొక్క తురుష్కవేషధారులగు సైనికు లాచీఁకటిలో బీదవుగు సైనికులతోఁ గలసిపోయిరి. మోరోపంతుభటులు తమచాతుర్యమువలనఁ గళావతిపల్లకిని వెనుక నుంచి తక్కిన సైనికుల పల్లకులను ముందు పోనిచ్చిరి. అటుపిదపఁ దమ కేదియో గొప్పయాపద సంభవించినట్లు కళవళపాటు నొందసాగిరి. ముందుభాగమున సైన్యమును శత్రువు లెదుర్కొనుటచే సేనాధిపతి కళావతిపల్లకిని సురక్షితప్రదేశమునఁ జేర్పుఁడని యాజ్ఞాపించె నని బోయీలతోఁ జెప్పి వారిని పల్లకితోఁ గూడ నరణ్యమార్గమునఁ గొనిపోయిరి.

మోరోపంతు పైనఁ జెప్పినవిధమునఁ బల్లకి మోయు వారిని మోసపుచ్చి కళావతిని విద్యానగరమునందలి తన గృహమునకుఁ గొనిపోయెను. అయిదాఱు నెలలనుండి యం దెవ్వరును వసించుట లేదు. గంగాబాయి యాయింటితాళము దీసి లోనికిఁ జనెను. మోరోపంతు బోయీలకుఁ గొంత

సొమ్మిచ్చి వారిని బంపివైచెను. పాపము! కళావతి కీమోస మేమియుఁ దెలియకపోవుటచే నామెయాగృహమునఁ జొచ్చెను. మోరోపంతుకూడ నామెవెనుకనే ప్రవేశించెను. పెద్దగడ్డము తోను తురక దుస్తులతోను ఉన్నయాతఁడొక యవనసైనికుఁ డని యామె దలంచెను. ఇంటియందు గంగాబాయిని జూచిన తోడనే యామెగుండె నీరైపోయెను. జైనా మొదలగువా రెచట నుండి రని తురుష్కసైనికవేషధారి నడిగెను. అతఁడు తనగడ్డమును శిరస్త్రాణమును దీసివైచి యొక్కనవ్వు నవ్వెను. తన్ను మోరోపంతు మోసపుచ్చె నని తెలిసి యామెయొక్క యఱ పఱచి మూర్ఛిల్లెను. ఆకేకతో భూనభోంతరాళములు ప్రతిధ్వనించునటు లాయెను. ఇంత యఱ పఱచు నని యాతఁడు ంచియుండ లేదు. అచ్చటికి సమీపముననున్న గృహమునకుఁ యి కొంచెము జలమును గ్రహించి కళావతిపైఁ జల్లుటకు డిగా వచ్చుచుండెను.

విద్యానగరమునందు వ్యాసనారాయణుఁ డనునొక గొప్పవైద్యుఁడు గలఁడు. అతనికిఁ బిత్రార్జితము లగు భూము లనేకము గలవు. పరోపకారార్థము తమ విద్యాధనముల నుపయోగించువారిలో నీతఁ డొకఁడు. శివాజీ మహారాజున కీతనియెడ నధికమగు భక్తిగలదు. మోరోపంతు జలమును గొనినపు డాతఁ డొకరోగియింటనుండి వచ్చుచుండెను. దీప కాంతిచే నాతనిని గనిపట్టి యింతవడిగా నేల పోవుచుండెనో యని యనుమానించెను. మోరోపంతాతనిని జూడకపోవుటయే కాక యా తొందరలోఁ దనయింటితలుపుకూడ వేయమఱచెను. ఎట్లైనను మోరోపంతు నొకసారి చూచి పోవుద మని

వ్యాసనారాయణుఁ డాగృహమునఁ బ్రవేశించెను. అప్పుడే కళావతి మూర్ఛనుండి తెలివొందెను. వ్యాసనారాయణుని జూచినంతనే మోరోపంతు తెల్లఁబోయెను. కళావతి, తన్నిటులైనను రక్షింపు మని యావైద్యుని పాదములపైనఁ బడెను. జరగిన సంగతి యంతయు నాతని కొక్కక్షణములోఁ దెలిసిపోయెను. అతఁడుమహాశూరుఁడును శివాజీ కత్యంతప్రియుమైన వాఁడు నగుటచే మోరోపం తాతనిని ధిక్కరింపఁజాలక పోయెను. వ్యాసనారాయణుఁడు కళావతిని తన గృహమున కాహ్వానించి మోరోపంతునకు బుద్ధిచెప్పి, ఇంకొకసారి యిట్టి పని చేసినచో శివాజీమహారాజుచే దండింపఁజేసెద నని యాతని కెఱుకపఱచి కళావతీసహితుఁడై తనగృహమునకుఁ బోయెను. మోరోపంతునకు వ్యాసనారాయణునిపైఁ దీవ్ర క్రోధము జనించెను. కాని యాతని నేమిచేయఁ గలఁడు? (వీధి వెంబడిఁ బోవుమదగజమునకు శునకము లఱచిన నేమి భయము ?)

వ్యాసశాస్త్రి వ్యాసనారాయణులు బాల్యస్నేహితులు. మిత్రునికొమార్తె యని తెలిసినపిదప నాతఁ డామెను తన పుత్రికవలెనే చూచుకొనుచుండెను. కళావతి తనకడ నున్నదని వ్యాసశాస్త్రి కాతఁడు కబురంపెను. కాని తులజాపురమున జరగిన సంకులసమరములో వ్యాసశాస్త్రి కుటుంబసహితముగా మరణించె నని విని కళావతి విషాదసముద్రమున మునిఁగి పోయెను. వ్యాసశాస్త్రి రాజద్రోహిగాఁ బరిగణింపఁబడుటచేఁ ఖానుసైనికులు తన్నుఁ బట్టుకొందు రేమో యని వెఱచి యాతఁడు జీవించియున్నను ఎవ్వరికిని తెలియకుండఁ గుటుంబ

సహితముగా దాఁగుకొనియుండెను. కళావతికిఁ దనజననీజనకుల మరణవార్త వినినదాది తిండిపై నరుచి పుట్టెను. తన కత్యంత ప్రియమగు దైవభక్తికూడ మఱచెను. ఆమెదుస్స్థితి దలంచి వ్యాసనారాయణుఁడును, అతనిభార్యయగు అంబాదేవియు నామెయెడ ద్విగుణీకృతప్రేమను జూపమొదలిడిరి. కాని యా బ్రాహ్మణునకు సుమతి యనువితంతుసోదరి కలదు, ఆమె మూర్తీభవించిన కోపదేవతయో యనునటులు గనుపించు చుండును. వ్యాసనారాయణుఁ డెంతశాంతయూర్తియో ఆమె యంత క్రోధమూర్తి. ప్రతివారియందును ఏవో తప్పుల నెంచి గవు లాడు టామె కలవాటు. అంబాదేవి యామెకడ మిక్కిలి యపడుచుండును. దైవవశమునఁ గళావతిపై సుమతికి ద్వేష దయించెను. తనవలెనే ముండితశిరోజయై దినమున కేక త్ర భోజనము చేయుచుండలే దని యామెను సుమతి షించుచుండెడిది. కళావతి యల్పాహారముచేఁ దృప్తినొం దున దైనను వ్యాసనారాయణునిబలవంతముచేత దినమునకు రెండుసార్లు భోజనము చేయుచుండెడిది. పూర్వాచారపరా యణయు, మూఢవిశ్వాసయు నగు సుమతి, జ్ఞానపూరిత హృదయయగు కళావతి ననాచారవతి యని దూషింపఁ జొచ్చెను. గోరుచుట్టుపై రోకటిపో టనునట్లు కళావతి కీబాధ దుస్సహముగా నుండెను.

# తృతీయ ఖండము.

## మొదటి ప్రకరణము.

### కూటము.

సీ. అరివీరవరుల దావాగ్ని యై దహియించు
క్షాత్రతేజం బింకఁ జావలేదు
పదునాల్గుభువనముల్ పాలింపఁగాఁ జాలు
ఘనతపోబల మడు గంటలేదు
ఉద్గ్రంథరాజము లోర్పుతోడను వ్రాయు
కవిశేఖరులు గంగఁ గలయలేదు
దేశరక్షణఁ జేయ దేహ మైనను వీడు
మాతృవాత్సల్యలు మడియలేదు

నివురు గప్పినగతి నుండు నిప్పువోలె
భారతీయార్యు లిన్నాళ్లు వఱలుదు రయొ!
దాస్యశృంఖలలను ద్రెంప ధైర్యవృత్తిఁ
దాల్చుచుండిరి యిప్పుడు దైవగతిని.

శ్రీశివాజీమహారాజుచే నిర్మితమగు దుర్గము లన్నిటి లోను ప్రతాపగఢదుర్గ మశేష్య మైనది. అతఁడు తనబొక్క సము నచటనే గుప్తపఱిచియుంచెడివాఁడు. యుద్ధసూచకము లేమైన నాతనికిఁ గనిపించినచో స్వపక్షసై నికుల నందఱను

మహారాష్ట్ర వీరపరీక్షా వ్యాజమున నచటికి రావించుచుండును. ఇట్టిసభలనే కూటము లని పిలుచుచుండిరి.

యవనులు తమపై దండెత్తివచ్చుచున్నా రని తెలిసి కొని, కూటము జరగుట కొక శుభదినము నేర్పాటుచేసెను. దుర్గమునకు ముందుభాగమున గొప్పమైదానము గలదు. అందు వీరుల ద్వంద్వయుద్ధ ప్రదర్శనమునకును, వేర్వేఱుఆటల కును ఉన్నత ప్రదేశ మొకటి నియమింపఁబడెను. ఆ స్థానమున కొక ప్రక్కనుగాడీ యనఁబడు కుర్చీ యొకటి యమర్పఁ బడెను. దానిపై హంసతూలికలచేఁ జేయఁబడినదిండ్లు పఱవఁ బడియుండెను. నియమితదినమునకు వేలకొలఁది వీరులు చుట్టు ప్రక్కల గ్రామములనుండి యచ్చటికి వచ్చిరి. ప్రాతఃకాలమున తొమ్మిది గంటలకు హిందూధర్మస్థాపన దీక్షాబద్ధ కంకణుఁడగు శివాజీమహారాజు గాడీపై నాసీనుఁడాయెను. గర్వాంధులగు నృపాలుర సభలవలె నాతనికూటము వందిమాగధనుతిగీత ములచేఁ బ్రారంభింపఁబడక, యేలికపాదములకడఁ దమప్రాణ ములనైన నర్పింపఁ జాలు వీరాధివీరుల జయ జయ ధ్వాన ములతో నారంభింపఁబడియెను. పిదప గానవిద్యా విశారదుల జాతీయగీత తరంగములచే సభ్యులమనములు నింపివేయఁ బడెను. అటు పిమ్మటఁ బ్రాచీనభారతవీరులకుఁ బ్రియములగు నాటల నాడ మొదలిడిరి. అం దెవరి సామర్థ్యమునకుఁ దగినట్లు వారికి మహారాజు బహుమానము గావించుచుండెను. తరు వాత ద్వంద్వయుద్ధ ప్రదర్శన మారంభమాయెను. తమకురణ విద్యయందుఁగల పరిచయమును భూపాలునకుఁ జూపఁదలఁచు వారే కాని విపక్షులను హాత మొనర్ప వలయు నని యొకఁడై

నను యత్నింపలేదు. శివాజీవంటిమహీపాలుఁడును, ఆతనియనుచరులఁబోలు వీరులును భారతిమాతను రక్షించుచున్నచో నామె నిత్యమును వీరపత్నిఖనియై విరాజిల్లుచుండును గదా ! సభ్యు లందఱును ద్వంద్వయుద్ధావలోకనా కుతూహలు లై యుండ, అశ్వారూఢుఁడగు వీరుఁ డొకఁ డెచటనుండియో హుటాహుటిగా నచ్చటికి వచ్చెను. మహారాష్ట్రాశ్వికులవలె నాతని ముఖము చేతిరుమాలుచేఁ గప్పఁబడి యుండెను. అతని శరీరమునుండి స్వేదబిందువులు బొటబొట రాలుచుండెను కూటమును సమీపించినతోడనే యాతఁడు వదనాచ్ఛాదనము దీసివైచెను. తోడనే తానాజీమాల్సురే వచ్చె నని యొరితో నొకరు చెప్పుకొనఁ జొచ్చిరి. వినోదములన్నియు నొక్కసారి యాఁగిపోయెను. అందఱిదృష్టులు నాతనిపైని కేంద్రీకరింపఁబడెను.

ఆతఁ డందఱను తప్పించుకొని శివాజీయున్న యెడ వచ్చి యాతనికి నమస్కరించి వందన మొసఁగెను. మహారాజాతనిని లేవఁదీసి తనప్రక్కనే కూర్చుండఁజేసి కొంతవడి యాతనితో సంభాషించెను. పిదపఁ దానాజీ లేచి మేఘగంభీర స్వనమున నిట్లుపన్యసించెను:—

“ మహారాజా ! సోదరులారా ! నేను జెప్పఁబోవు విషయము కడు ముఖ్యమైనది. ఇంతదనుక మనము వాగ్రూపమునఁ జూపిన దేశభక్తి కార్యరూపమునఁ బరిణమింపఁజేయవలసిన సమయ మిపుడు కలిగినది. దేవీ కల్యాణమునకు మాతృభక్తు లనేకులు తులజాపురమునకు వచ్చి రని దేశద్రోహి యగుపహార్సిం గఫ్జుల్‌ఖానుతోఁ జెప్పెనఁట !

హిందూమతప్రియులను బంధించుటకిదియే మంచిసమయ మని యామూఢతురుష్కుఁడు ససైన్యముగఁ దులజాపురము నకు వచ్చెనఁట! ధైర్యముగల పురుషునివలె వచ్చినచో మన భారతీయసోదరు లాతనిని దేవికి బలి యొసంగెడు వారే. ఎదుటికి వచ్చి జయించుటకు శక్తిలేక రాత్రివేళఁ బదునైదు వందల సైనికులతో దేవాలయమును ముట్టడించి యమాంత ముగ యాత్రికులపైఁ బడి రమాస్వామి నూర్వురు మహా ష్ట్రులను జంపివైచి పహర్‌సింగుచే రాజద్రోహులుగా చఁబడిన నూటయేఁబదిమంది హిందువులను ఖైదీలఁగాఁ మ ట్టుకొనెనఁట! అంతతో నూరకుండక యాలయాధికారిని ధించి కొన్నిపేళ్లను జూపి యానామములుగల వారిని ల రించి తన కెఱింగింపు మని బాధించెనఁట! తన్నుఁ పివైచినను యవనులకు సాహాయ్యము చేయనని యాతఁడు కరించెనఁట! అదిగదా ధైర్యము భారతీయు లందఱు నట్టివా రైనచో నీతురకలు మనదేశమున నిలువఁగలరా? హిందువుల కింకను తగినంతకష్టము కలుగలేదని కొలఁదిరోజు లలో మహారాష్ట్ర దుర్గములను స్వాధీనపఱుచుకొన నెంచె నఁట! ప్రస్తుతము నాకుఁ దెలిసిన దింతియే. దేవి యెదుటనే యామెబిడ్డలను జంపినతురుష్కులపైఁ బగ దీర్చుకొనుట యెట్లో మీరే యోజింపవలయును."

అని చెప్పి తానాజీమాల్సురే కూర్చుండెను. ఆతనిమా టలు విన్నప్రతివారును క్రోధోద్దీపితులై పోయిరి. అందు శివాజీమహారాజు త్రిపురాసుర సంహార మొనర్చినశివునివలెఁ బ్రకాశించుచుండెను. ఆతని నయనములనుండి యగ్నికణములు

గురియుచున్నటు లుండెను. కోపముచే ముఖ మెఱ్ఱఁబడెను. అతఁడు తనయాసనమునుండి లేచి యిట్లు చెప్పఁబూనెను.

“పౌరులారా! క్షత్రియుఁ డయ్యును ద్రోహులను గూడి తనదేశమువారిని జంపించిన పహార్‌సింగు నొక్కవారముదినములలో యమపురికి బంపకున్నచో నే నగ్నిప్రవేశ మొనరించెద నని సూర్యచంద్రాదులు సాక్షులుగాఁ బ్రతినఁ జేయుచున్నాను. అఫ్జల్‌ఖానువిషయమునఁ దానాజీమాల్సురేతో నాలోచించి మీ కందఱకును దేశమాతకును ప్రీతియగువిధమునఁ గావించెద నని బాసచేయుచున్నాను. ప్రస్తుతమింతకన్న విశేషము చెప్పుటకు వీలులేదు;-ఇంక మనముస్వచిత్తులమై నియమితకార్యక్రమమును కొనసాగింపవలయును”

అనిచెప్పి మహారాజు కూర్చుండెను. కొలదిసేపటిలో సభలో నెప్పటియుత్సాహ ముదయించెను. ఆనాఁ డంతయు మహారాష్ట్రులాటపాటలతోనే కడపివైచిరి. రాత్రి వారందఱకును గొప్పవిందు చేయఁబడెను. ఫలాహారానంతరము మహారాజు నాయకులతో రహస్యాలోచనసభ గావించెను. ఆమఱుసటిదినమున నెచటివా రచటికిఁ బోయిరి.

ఆనాఁటిమధ్యాహ్నము రెండుగంటల కిరువురు మహమ్మదీయాశ్వికులు ప్రతాపగఢ దుర్గమునుండి వెలువడిరి. వాయువేగమునఁ బోవువారిని పోలికపట్టుట కైనను ఎవరికిని సాధ్యము కాలేదు. కనుచీఁకటి పడుచున్నసమయమునకు వారు విద్యానగరప్రాంతమునకు వచ్చిరి. ఆపురముబయటను పెద్దమామిడితోఁట కలదు. అందు రమణీయమగు గృహమొకటి నిర్మింపఁబడెను. ఉద్యానవనాధికారియగు వీరసిం

వాఁడు సమయము చిక్కినపుడెల్లఁ దనకు బీజపురపునవాబు నెడఁగల రాజభక్తిని వాగ్రూపమునఁ బ్రకటించుచుండెను. మనపథికులు శ్రమ నివారించుకొనుటకై యతని యారామమునకే వచ్చిరి. అప్పటి కాతఁ డొంటిగఁ గూర్చుండి యేదియో యాలోచించుచుండెను. పథికుల నాతఁడు మిగుల గౌరవించి వారిని తనరహస్య కార్యాలోచనాలయమునకుఁ గొనిపోయి తినుటకుఁ గొన్ని ఫలము లిచ్చెను. వారించుక సేదదేఱినపిదప నీక్రిందివిధమున మాటలాడుకొనిరి.

ప్రథమపథికుఁడు—పహార్‌సింగును గూర్చి నీ వేమైన నెఱుంగుదువా?

వీర—అతఁ డీదినమున నీగృహముననే విడిసియున్నాఁడు.

ద్వితీయపథికులు—(ససంభ్రమము) అటులా? పహార్‌సింగిచ్చటి కేల వచ్చెను?

వీర—అఫ్జల్‌ఖానుజనానాతో వచ్చుచున్నయొక హిందూ బాలిక నెవరో దొంగలించిరఁట!

ప్రథమ.—ఎవ్వరు దొంగిలించిరి?

వీర—ఆవివరము నా కేమియుఁ దెలియలేదు గాని తురుష్కులను తస్కరు లెట్లో వంచించి రని తోఁచుచున్నది.

ప్రథమ—ఇప్పుడు పహార్‌సింగెచటికిబోయినాఁడు?

వీర—ఆబాలికజాడ లరయుటకై యూరిలోనికిఁ బోయినాఁడు. రాత్రి తొమ్మిదపదిగంటలకు వచ్చెద నని చెప్పినాఁడు.

అటుపిమ్మట రెండుగంటలకాలము వారు మువ్వురును రహస్యముగ నేమియో యాలోచించుకొనిరి. పిమ్మట యవన సైనికులాగృహమునుండి వెలువడి నగరమార్గమును బట్టిరి.

సరిగా రాత్రి తొమ్మిదిన్నఱగంటలకుఁ బహార్‌సింగు వీరసింహునిగృహమువంకకు వచ్చుచుండెను. ఆతఁడు లోనఁ బ్రవేశించి వీరసింహునిప్రక్క నాసీనుఁ డగుచున్న సమయమునఁ బ్రతాపగఢముననుండి వచ్చిన యవనసైనికు లిరువురును తటాలునఁ దలుపు దెఱచుకొని లోనికి వచ్చిరి. వారిని జూచి పహార్‌సింగు కత్తి దూసి "మీ రెవ్వరు? ఇట్లేల యీ గృహమునఁ బ్రవేశించితిరి?" అని కోపోద్దీపితస్వరముతోఁ బ్రశ్నించెను. అందులకు వారు తాము పురరక్షకుల మనియు శివాజీ తానాజీమాల్సురేలు ప్రతాపగఢమువంకకుఁ బో చుండఁగాఁ జూచితిమనియుఁ దమకు వారిని బంధించునం సామర్థ్యము లేకపోవుటచే వీరసింహుని సాహాయ్యార్థ వచ్చితి మనియుఁ గ్లుప్తముగాఁ దెలిపిరి. వెంటనే పహార్‌సి వీరసింహులును యవనసైనికులవెంట బయలుదేఱిరి. వా రయమునఁ బ్రతాపగఢమువంకకుఁ బోవు చిన్నమార్గమున బడి పోవుచుండిరి. అట్లొకింతదూరము పోయిన పిదప వారొక నిర్జనప్రదేశమునకు వచ్చిరి. అప్పుడు తురుష్కులును వీరసింహుఁడును కలసి పహార్‌సింగుపై నొక్కసారిగాఁ దలపడిరి. పహార్‌సింగు తనయుపాయస్థితిని గ్రహించి తనకుఁ గత్తిసాము నందుఁగల సామర్థ్యము నుపయోగించుచుండెను. వారిని సాధ్యమగు నంతవఱకు దూరముగా నుంచుటకుఁ బ్రయత్నించుచుండెను. కాని వీరాధివీరులగు వారిధాటి కాతఁడు నిలువఁజాలకపోయెను. కొలఁది సేపటిలోనే వా రాతనిని బంధించివైచిరి. ఆయవనసైనికులు శివాజీ తానాజీమాల్సురేలసియు దేవ్యాలయమున నాతఁడు హిందువుల కొనరించిన

యపకారమునకు శిక్షించుటకై వారిట్లు గావించి రనియు వీరసింహుఁడు పహార్ సింగున కెఱింగించెను. పహార్ సింగు ఖోనులోని సింగమువలెఁ గోపముచే మండిపోవుచుండెను. దొంగలువలెనే పైఁబడి యొకశూరుని బంధించుట వీరధర్మము గాదని యాతఁడు శివాజీని దూషింపమొదలిడెను. దేవాలయమును ముట్టడించినపు డీనీతు లెటకేఁగెనని మహారాజాతనిఁ బ్రశ్నించెను. ధనము వలనఁ దనకు విముక్తి గలుగదని యాతఁ డెఱుంగును. అందుచే నాతఁడు మహారాజును యుద్ధభిక్ష నిడుమని వేఁడుకొనెను. తనకుఁ జాలకాలముననుండి యాతనితో ద్వంద్వ యుద్ధము చేయవలయుననుకోర్కె కలదనియు, తనయంత్య ప్రార్థన మాలించి నవేఁడికోలును నెఱవేర్పు మనియు మహారాజు నాతఁడింతో వేఁడుకొనెను. దరహాసితవదనుఁడై మహారాజందుల కంగీకరించెను. తానాజీ వీరసింహులాతనిబుద్ధి మరల్ప నెంత యత్నించిన నాతఁడు తిరుగఁడాయెను. ఒక్కక్షణమునఁ బహార్ సింగు బంధవిముక్తుఁ డాయెను. శివాజీపహార్ సింగులు ద్వంద్వ యుద్ధమునకుఁ గడంగిరి. దీర్ఘబాహుఁడగు శివాజీకి ఖడ్గ యుద్ధమునఁగల చాతుర్యమునందు పహార్ సింగు బలమేమియుఁ బనికిరాకుండెను. పదునైదునిముసములు వారు తమ చాతుర్యము నంతయుఁ గనఁబఱచుచుఁ బోరాడిన పిదపఁ బహార్ సింగు తనబలము నంతయు నుపయోగించి శివాజీ తలపైని కృపాణముతో నొకగట్టిదెబ్బ కొట్టయత్నించెను. ఆదెబ్బ తగిలినచో నాతఁ డాక్షణమున మృతి నొందవలసిన వాఁడే. కాని కుశాగ్రబుద్ధియగు శివాజీ ప్రక్క కొక్క గంతు

వై చెను. అందుచేఁ జోరనాయకుని దెబ్బ తప్పిపోయెను. స్థూల కాయుఁడగు పహార్ సింగు తనకత్తిని మరల నెత్తునంతలో మహారాజు తనభవానీఖడ్గము నా పాపాత్ముని కంఠమువైఁ బఱపెను. ఆదెబ్బతోఁ బహార్ సింగు ప్రాణములఁ బాసి నేలఁ గూలెను. పిమ్మట మహారాజు తానాజీమాల్సురేతోఁ గలసి ప్రతాపగఢము మార్గమును బట్టెను.

ఆరాత్రి వీరసింహుఁడు గృహమునకుఁ బోయి సుఖముగా నిదురించెను. మఱునాఁడు పహార్ సింగును కనుఁగొను మిషను పుర మంతయుఁ గలయఁజూచివచ్చెను. అత్యవసరము గు కార్యాచరణమునకై యెచటికైనను బోయి యుండవచ్చు నని తన యిరుగు పొరుగువారితోఁ జెప్పెను. ఆనాఁటి సాయంకాలమున విద్యానగరమునకు నలువురు బాటసారులు వచ్చి తమకు మార్గమధ్యమున నొకక్షత్రియునిశవము కనిపించె నని రక్షక శాఖాధికారుల కెఱింగించిరి. వారాకళేబరము పహార్ సింహునిదిగా గుర్తించి వీరసింహున కెఱింగించిరి. ఘాతుకులను పట్టుకొనుట కెంత ప్రయత్నించినను వారి జాడయైనను తెలియలేదు. ఈ సంగతు లన్నియు నత్యంత విషాదసూచకములగు వాక్యములతో నఫ్జల్ ఖానునకు వీరసింహుఁ డెఱుకపఱచెను. పహార్ సింగును మృత్యుదేవత కర్పించుటయందు వీరసింహుఁడు భాగస్వామి యని యెవ్వరును తలంపరైరి.

# రెండవ ప్రకరణము.

## శివాజీ యుక్తి.

“ తిరిగి హరిపురసురతరుసురల మరగి
బహుళ హళహాళి భరిత కల్బరగినగర
నగరపురపర పరివృఢ జవనయవన
పృతన భవదసి ననిఁ దెగి కృష్ణరాయ !.”

(ఆముక్తమాల్యద.)

శివాజీ-అఫ్ఝుల్‌ఖానులకు సంధిమాటలు జరుగుచుం రాయబారము మిషమున శత్రుబల నిరూపణమునకై పీనాథపంతను వానిని అఫ్ఝుల్‌ఖాను ప్రతాపగఢమునకుఁ పెను. ఆతనికి పలయు సదుపాయము లన్నియు శివాజీ నరించెను. గోపీనాథుఁడచటికిఁ బోయిన నాఁటిరాత్రి యెనిమిది గంటల కిరువురు మహారాష్ట్రు లాతని దర్శనమున కరుగుదెంచిరి. వారి యాచారము ప్రకారము వారు చేరుమాళ్లచే ముఖములను గప్పికొని యుండుటచే ద్వారరక్షకుఁడు వారిని గుర్తింపఁజాలకపోయెను. ప్రతీహారివలనఁ దనకొఱకెవరో వచ్చియుండిరని గోపీనాథుఁడు విని వారిని గొనివచ్చుట కాజ్ఞ నొసఁగెను. మహారాష్ట్రులకు మహమ్మదీయ రాయబారి యున్నయెడకు మార్గముఁ జూపి ద్వారరక్షకుఁడు తన స్థానమునకుఁ బోయెను. ఆయోధు లిరువురును గోపీనాథునకు సాష్టాంగ దండప్రణామము లాచరించిరి. గోపీనాథుఁడును వారికి నమస్కరింపఁ బ్రయత్నించెను గాని వా రాతని నివారించి తాము పండితులకు వందన మొనరించుటయే కాని

వారిచే మ్రొక్కఁబడుటకుఁ దగనివార మని చెప్పిరి. ఆ యిరువురును సమీపమున నున్న యాసనములపైఁ గూర్చున్న పిదప నందొకఁడు గోపీనాథున కిట్లు చెప్పఁదొడంగెను. "గోపీనాథపండితశేఖరా! నీబోఁటివిద్యాధికు లగుపుత్త్రులు భారతమాత కత్యల్పముగాఁ గలరు. వారు దేశసేవాపరాయణులైనచో మాతృదాస్య విమోచన మొక్కక్షణములో జరగును. కడుపుకూటికై విదేశీయులను గొల్చుచుఁ దల్లికిఁ దీఱని యిక్కట్టులను గూర్చు టెంత హేయమైనపనియో నేను జెప్పవలయునా? తులజాపురమున హిందూసోదరులను జంపిన తురుష్కులచేతుల కింకను రక్తపుజాడలు పోలేదే! అట్టి కరములతో నొసంగుచున్న ధనము గైకొని రాజభోగవలనుభవించుటకంటె యాచనవలన జీవించుటయే యుత్తమము ఇంతకఠినముగఁ జెప్పితి నని కోపింపవలదు. మానహీనుల దాస్యము చేయుచుండుటచే మీ తెలివి నివురుగప్పిననిప్పు చందమున నైనది. ఇంక మనకు మునుపటివలె నిదురించుటకు సమయము లేదు. మేల్కొనవలయును. తురుష్కులను దేశమున నుండి పాఱఁద్రోలవలయును. దేశమాతను స్వతంత్రనుజేయవలయును. అసమానబుద్ధిశాలి వగు నీవుకూడ యవనులకు దాస్యము చేయుట కిష్టపడుట నాకుఁ జాల వింతగా నున్నది.

గోపీ—అదియంతయు నిపు డేల? వ్యర్థముగాఁ గాలము గడపుటకు నాకు సమయము లేదు. మీరు వచ్చినపని యేదియో సత్వరము తెలుపుఁడు.

మహారాష్ట్రుఁడు—దేశమాతస్థితి యెట్లున్నదో ఒక్కక్షణము గమనించుటకైనను నీకుఁ దీరిక లేదా? అయ్యో

భారతపుత్రులారా! ఎట్టి దౌర్భాగ్యదశకు వచ్చితిరి. గోపీనాథునివంటి ధిషణాధురంధరులే దాస్యవ్యామోహమునం బడిపోవుచుండఁ బెఱవారిమాట యేల? బ్రాహ్మణోత్తమా! నిరాయుధులును, దైవభక్తిపరాయణులు నగుతులజాపుర యాత్రికులను జంపుట నీకు న్యాయముగాఁ గనిపించుచున్నదా? రాత్రికి రాత్రి పుర మంతయు ధ్వంసము చేసిరే. వృద్ధు లనక పిల్ల లనక యొక్కరీతిగాఁ బురవాసులను ఖండించిరే. ఇన్ని దుర్మార్గములు యవనులు జరపుచుండ నింకను వారిని గొల్చుటకు నీ విచ్చగించుచుంటివా? ఈ దినమున యాత్రికులైరి. రేపు మన మగుదుమే! భారతీయుల దుస్స్థితిని గాంచిన నీ గుండె వ్రీలిపోవుట లేదా? కన్నులు బాష్పపూరితము లగుట లేదా? పరదేశమునుండి వచ్చి మన దేశమువారి నన్యాయముగ, అకారణముగ హింసించి మాన ప్రాణములను హరించిన యవనులను ఖండ ఖండములుగఁ జెండివేయక యింకను వారి పాద దాస్యముఁ జేయ నెంచుచుంటివా? ఇది యంతయు నీతప్పు గాదు. సహవాసదోషముచేఁ గలిగినది. ఇకనైనను లెమ్ము. మాతృదాస్య శృంఖలా విచ్ఛేదమునకై నీవు చేయఁగలిగిన సాహాయ్య మొనరింపుము. ఒకపుడు రత్నగర్భ యైనమాత నేఁడు కట్ట గుడ్డ లేక తినఁ దిండి లేక మలమల మాఁడుచున్నది. పుత్రులు విదేశీయులఁ గొల్చుచు వా రొనరించు నన్యాయములకుఁ దల లొగ్గవలసి వచ్చినది. ఈ దుస్స్థితి వలననే హిందువులు కార్య రంగమునకు దిగకున్నారు. లెమ్ము—నిద్రింపకుము—కత్తి తీయుము. (తాను ఒర

నుండి కత్తిని దీసెను. ఆతని యనుచరుఁడును గోపీనాథుఁడును కూడ మంత్రముగ్ధులవలెఁ దమకృపాణములఁ దీసిరి. మాతను రక్షించుటకుఁ బ్రాణములనైన నిచ్చుటకు సిద్ధపడుము. (ఈమాటలు వినుచున్న గోపీనాథుని కన్నులశ్రువులచే నిండిపోయెను.) నీబోఁటిపండితునకు ధనలోపము రాకుండఁ జూచుబాధ్యత నేను వహించెదను. (అని ముఖమునఁ గప్పియున్న చేతి రుమాలు తీసివైచెను. ఆతఁడు మహారాజగు శివాజీయే!) మనదేవికి యవను లొనరించిన దుర్మార్గమును వడ్డితోఁగూడఁ దీర్చుటకు సిద్ధపడుము.

అనునంతలో గోపీనాథుఁడు శివాజీని కౌఁగిలించుకొనెను. శివాజీ గంభీర భాషణము లాతని మానసమున నూతనతేజము గలిగించెను. ఆతఁ డొక్కక్షణములో దేశభక్తుఁడై పోయెను. శివాజీయు నాతని యనుచరుఁడగు తానాజీమాల్సురేయును తమయుద్దేశము నెఱవేఱిన దని యానంద సాగర నిమగ్నులైరి. అటుపిమ్మట శివాజీ యుద్ధప్రయత్నమున లేఁడనియు, సైన్యములతోఁ బ్రతాపగఢమునొద్దకు వచ్చినచో భయపడి బీజపురమున కనుకూల మగు విధమున సంధి చేసికొన వచ్చుననియు, అందుచే వెంటనే బయలుదేఱి యరణ్యమార్గము లని శంకింపక ప్రతాపగఢమునకు రమ్మనియు గోపీనాథునిచే నఫ్జుల్ఖానున కొక జాబు వ్రాయించి ఖానునొద్ద కొక యాశ్వికభటునిచేఁ బంపెను.

గోపీనాథుని లేఖను జూచిన వెంటనే యఫ్జుల్ఖాను పదునైదు వందల గుఱ్ఱపు రౌతులతోఁ బ్రతాపగఢమునకు బయలుదేఱెను. రాను రాను అరణ్యమార్గము లెక్కువగు

చుండెను. కొంత దూరము వచ్చిన పిదప నడవి మఱింత దుర్గమ మైపోయెను. వెనుదిరుగవలసి వచ్చినచో బీజపురముఁ జేరుకొనుట దుష్కర మని వారికిఁ దెలిసిపోయెను. కాని ఖాను కార్యదీక్ష గలవాఁడు. అందుచే నెన్ని కష్టములకైన నోర్చి ప్రతాపగఢము చేరి శివాజీని కైదీగా బీజపురమునకుఁ దీసి కొని పోవలయునని సైనికులకు వడిగాఁ నడచుట కాజ్ఞనిచ్చెను. యుద్ధసూచన లేవియు వారికిఁ గనిపించుట లేదు. పల్లెలదగ్గ ఱకు వచ్చినపుడు మాత్ర మిరువది ముప్పదిమంది మహారాష్ట్ర సైనికులు వారికి స్వాగత సత్కార మొసఁగు చుండెడివారు. మార్గమధ్యమున నశించచట గొఱ్ఱెలకాపరులు తప్ప వారి కెవ్వరును కానిపించుట లేదు. అందుచే శివాజీ యుద్ధప్రయ త్నమున లేఁడనియు, సంధికి సమ్మతించుననియు వారుతలంపఁ జొచ్చిరి. ఇట్లు వారు ప్రతాపగఢమునకుఁ బదిమైళ్ల దూరము వచ్చునప్పటికి మహారాష్ట్ర రాయబారి యొకఁడు ఖానుకడకు వచ్చెను. శివాజీ మహారాజునకు బీజపురపు నవాబుపైఁ గ్రోధ మెన్నఁడును లేదనియు, అందుచే సంధి కిచ్ఛగించు చుండె ననియు నారాయబారి చెప్పెను. సంధిషరతుల నేర్పఱచు కొనుట కప్ఝుల్‌ఖానును శివాజీ యాహ్వానించెను. నవాబునకుఁ బ్రతినిధి యగుటచే, శివాజీకడకుఁ బోవుట గౌరవలోప మని ఖాను తలంచెను. మహారాజొక సేనానాయకునికడకు వచ్చుట సమంజసముగా నుండ దని రాయబారి చెప్పెను. అందుచే శివాజీ అప్ఝుల్‌ఖానులు మాటలాడుకొనుట కొకయుచ్చప్రదేశ మేర్పఱచుటకును, ఒక్కొక్క రేకసైనికమాత్రసహాయు లై

యచటికిఁ బోవలయుననియు నేర్పాటు జరగెను. ఆమఱునాఁటి యుదయమునఁ బదిగంటలకు శుభసమయ మేర్పఱుపఁబడెను.

ప్రతాపగఢము సమీపమున నున్న యొకకొండశిఖర ముపైఁ గొంతభాగము చదునుచేయఁబడి యుండెను. మాట లాడుకొనువారి కెండతగులకుండుటకై యొకకూలివాఁడచటఁ జలువచాపలను గట్టుచుండెను. ఆ గుట్టపై నిలిచినచోఁ జుట్టు నున్న ప్రదేశ మంతయు బాగుగాఁ గానిపించును. నియమిత దినమున అఫ్జుల్‌ఖాను వెందలకడ లేచి స్నానాద్యనుష్ఠానముల దీర్చుకొని సన్నని తెల్లబట్టలు ధరించి తొమ్మిదిన్నఱ గంటలకుఁ గొండపైకి బయలుదేఱెను. ఆతనికి సహాయుఁడుగా ఫెజిల్ ఖాను వచ్చెద నని చెప్పెను, కాని ఖా నాతనిని వారించి సయ్యదుబందూ అనునొకసైనికుని తనవెంట రమ్మని యాజ్ఞా పించెను. కవచము నైనను ధరింపక, కృపాణమాత్రసహాయుఁ డై పల్లకిలోఁ గూర్చుండి యాతఁడు కొండపైకిఁ బోయెను.

శివాజీ మహారాజు సరిగాఁ బదిగంటలకుఁ దానాజీ మాల్సురే సహాయుఁడై కొండపైకిఁ బోవుటకుబయలుదేఱెను. వారిరువురును క్రోధసూచకము లగునెఱ్ఱని బట్టలు ధరించిరి. కొండపై నయిదాఱుగురుండుటగాంచి మహారాజు భయపడి నట్లు నటించెను. ఇరువురు తప్పఁ దక్కినవారిని కొండ దిగి పోవునట్లుఖానాజ్ఞాపించెను. కాలినడకను వచ్చుచున్నమహా రాజుంగాంచి యాతఁడు మిక్కిలి యాశ్చర్యపడియెను. శివాజీ యనిన ఆజానుబాహుఁ డనియు భీకరరూపుఁ డనియు నాతఁడు తలంచెను. పురములను దహించు నగ్నికణ మెంత యుండునో యాతఁ డెఱుంగఁడు గాఁబోలును !

శివాజీ తానాజీమాల్సురేలు ఖాను సయ్యాదు లున్న యెడకు వచ్చిరి. శివాజీ యఫ్జుల్‌ఖాను లొకరికొకరు సలాము చేసిన పిదప, తనకృపాణమును బూని శివాజీ ఖానుపై యుద్ధమునకుఁ గడంగెను. యుద్ధవిద్యా విశారదుఁ డగు ఖాను తన కత్తి నొక్క క్షణములోఁ దీసి శివాజీ నెదిరించెను.

నిరాయుధులగు తులజాపుర పౌరుల నాకస్మికముగా నెదిరించినందులకు ఫలిత మనుభవింపు మని గద్దించుచు మహారాజు ఖానుపైఁ దలపడెను. ఖానునకుఁ గవచము లేక పోవుటచే నాతఁ డెంత నేర్పుగా యుద్ధము చేయుచున్నను గాయములు విశేషముగాఁ దగులుచుండెను. మహారాజు వస్త్రముల క్రింద నున్న గొలుసుకవచ మాతనికి గాయములు తగులకుండునట్లు కాపాడుచుండెను. రెండు మూఁడు నిముసములు ఖానుశివాజీలు ద్వంద్వయుద్ధము చేసిరి. పిదప మహారాజు ఖానుని శిరముపైఁ దనకరవాలముతో బలమగునొక్క దెబ్బ కొట్టెను. దానితో అఫ్జుల్‌ఖాను నేలఁబడి వీరస్వర్గమును చేరుకొనెను.

ఖానునకు సాయముచేయవలయు నని సయ్యాదుబందూ యెంతయో ప్రయత్నించెను. ఖాను శివాజీలు తలపడినపుడే తానాజీమాల్సురే సయ్యాదుపైఁ గత్తి దూసెను. ద్వంద్వ యుద్ధ విద్యానిపుణుఁ డగు తానాజీయును భీమబలుఁ డగు సయ్యాదు నయిదాఱు నిమిషము లతివిచిత్రముగా యుద్ధము చేసిరి. ఖాను చనిపోయినపిదపఁగూడ శివాజీ, తానాజీమాల్సురేకు సాయ మొనరింపలేదు. తుదకు సయ్యాదు బందూకూడ మహారాష్ట్రునిఖడ్గముచేతనే మరణించెను.

ఆ కొండపైని కూలివాని వేషమును ధరించి తడకలు కట్టుచున్నవాఁడు మహారాజాజ్ఞపైఁ దన తుతారాను తీసి మూఁడుసార్లు గట్టిగా నూఁదెను. ఆశబ్దము వెలువడినంతనే సమీపముననున్న ప్రతాపగఢ కోటలోనుండి ఫిరంగి శబ్దము లారంభ మాయెను. ఇంత వఱకును ఇంటి చావడులలో దాఁగికొనియున్న యయిదువేలు మావలీలును బీజపుర సైనికులపైఁ బడిరి. యుద్ధమునకు సిద్ధముగా లేకున్నను కొండపై యుద్ధము జరుగుచుండె నని చూచినవా రాప్రదేశమునకుఁ బోవఁ బరుగిడఁ జొచ్చిరి. కాని మావలీసైనికులు వారి నందఱను ఖండించివైచిరి. కోటలోనుండి వచ్చు తుపాకీదెబ్బల చేతను మావలీల దారుణ కృపాణాఘాతములచేతను మూఁడవంతులు సైనికులు చనిపోయిరి. కొందఱు గుఱ్ఱముల నెకి వచ్చిన మార్గమును బట్టఁ జొచ్చిరి, కాని యామార్గ లన్నియుఁ గొట్టివేయఁబడిన చెట్లచే నరికట్టఁబడెను. ఏమి చేయుటకును తోఁచక యటు నిటు పరుగిడుచున్న సైనికులను మహారాష్ట్రు లనాయాసముగాఁ జంపివేయఁ జొచ్చిరి. యవన సైన్యమంతయు నిట్లు పంచబంగాళీ మైపోయెను.

మహారాష్ట్రుఁడగు బలవంతరావు చిన్ననాఁడు ప్రతాపగఢమున నుండుటచే నాతని కచటి మార్గము లన్నియు బాగుగాఁ దెలియును. అందుచే ఫెజిల్ఖానును. ఆతనిసమీపముననున్నయిరువదిమందియాశ్వికులను ఒకచిన్నలోయలోనుండికొనిపోవుచుండెను. లోయ రాను రాను సన్నముకాఁజొచ్చెను. ఇఁకముందు మార్గము లేదేమో యని సైనికులు భయపడఁ జొచ్చిరి. కాని యాతఁడు వారికి ధైర్యముచెప్పి యాసన్నని

మార్గముగుండా గొనిపోయెను. ఇట్లు కొంతదూరము పోయిన పిదప మార్గము వెడల్పు కాఁజొచ్చెను. ఆశ్వికులముఖములు వికసించెను. కాని యామఱుచటినిమిషముననే వారు తెల్లఁబోవఁజొచ్చిరి. ఆమార్గమున కడ్డముగా రమారమి నూర్వురు కాలిబంటులు కల రని వారు గ్రహించిరి. ఫెజిల్‌ఖాను తన యాశ్వికులకు ధైర్యము చెప్పి తురగముల నొక్కసారి యదల్పుఁడని హెచ్చరించెను. గుఱ్ఱములు వాయువేగమునఁ బరువిడఁ జొచ్చెను. కాల్బలము వారి నడ్డగించెను గాని యాశ్వికులధాటికి భటు లాఁగఁజాలకపోయిరి. ఫెజిల్‌ఖా నను చరసహితుఁ డై మహారాష్ట్రులను చిందఱవందఱ గావించి యెటులో మార్గముచేసికొని సైన్యసహితముగాఁ దప్పించుకొని పోయెను. ఇట్లు పోయిపోయి వారు నదీతీరమునకు వచ్చిరి. అందఱును విశ్రాంతికై యచ్చట దిగిరి. ఫెజిల్‌ఖాను, జైనాలుర్లీలకై పరితపింపఁజొచ్చెను. శివాజీ పరకాంతలను సోదరీమణులుగా భావించి యెవరిగృహములకు వారిని బంపునని, బలవంతరావు ఫెజిల్‌ఖానునకుఁ జెప్పి యాతనివిషాదమును బాపెను. జైనాలుర్లీలను మహారా జేమి చేసెనో కనుఁగొనుటకు బలవంతరా వొకసాధారణమహారాష్ట్రుని దుస్తులు ధరించి ప్రతాపగఢమునకు మఱియొకమార్గమునఁ బోయెను. ఫెజిల్‌ఖానింకను విద్యానగరము చేరకముందే బలవంతరావు మరల వారినిగలసికొని మహారాజు జైనాలుర్లీలను వారికాప్తబంధుఁ డగుమహమ్మదుఖానుకడకుఁ జంపావతీపురమునకుఁ బంపుచుండె నని తెలిసికొంటి నని చెప్పెను.

## మూఁడవ ప్రకరణము.

### "సతి."

" తే. గీ. ఆయురైశ్వర్యకీర్తుల నపహరించు,
పరసతీసంగమము ధర్మపథమునందుఁ
బరఁగువారలు పరిహరింపంగఁ గనియుఁ,
వినియుఁ దెలియరె యిది దుర్వివేక మగుట."

(తిక్కన సోమయాజి.)

ఫెజిల్ ఖాను మున్నగువారు విద్యానగరము సమీపమునకు వచ్చి యూరివెలుపల నున్న యొక యారామమునందు విడిసిరి. ఆపురమునకు వచ్చినతోడనే ఫెజిల్ ఖానునకుఁ గళావతి యెట్లున్నదో తెలిసికొనవలయునని బుద్ధి వొడమెను. నగరవీక్షణార్థ మతఁడు పోఁదలంచెనుగాని బలవంతరా వాతనిని వారించి తానాయూరిలోనిసంగతులను కళావతీక్షేమవార్తనుగూడఁగనుఁగొనివత్తునని చెప్పి బయలుదేఱెను. ఆనాఁడు పుర మంతయు సందడిగా నుండెను. వీథు లన్నియుఁ బచ్చనితోరణములతో నింపివేయుచుండిరి. ఇట్లు లలంకరించుటకుఁ గారణ మే మని బలవంతరా వొకపథికుని ప్రశ్నించెను. ఆపురమందలి బాలునకు సైతము దెలిసినయీవిషయ మీతనికిఁ దెలియకుండుట కాఁతడు మిక్కిలి యాశ్చర్యపడెను. ఆతఁ డాయూరివాఁడు కాఁ డని తెలిసినపిదప నాతఁ డిట్లు చెప్పఁదొడంగెను. " ఈపురమునందు గళావతి యనుకాంతగలదఁట! ఆమె కడు సౌందర్యవతియును, మిక్కిలి తెలివి గలదియు నని వాడుక. ఆమె జననీ జనకులు మున్నగువారు తులజాపురమునందు జరగిన తుములయుద్ధమున

మరణించిరఁట ! అనేకములయిన విపత్తులను తరించి యామె యిప్పుడీపురముననే వ్యాసనారాయణునిగృహమున నివసించుచున్నది. జ్ఞానోత్తేజిత యగునామె కీబాహ్యాచారములందు నమ్మకము లేకుండుటచే ముండితశిరోజ గాక పుణ్యస్త్రీవలెఁ జరించుచున్నది. ఆమెభర్త చిన్ననాఁడే చోరులచే వధింపఁబడెనఁట ! తల్లిదండ్రుల మరణవార్తవిని నంతనే యామె పరమ విరాగిణియై తిండియైనను సరిగాఁ దినుట లేదఁట! ఆమె "సతి" యను నాచారము ప్రకారము హుతాశనునకు బలి యగుటకు నిశ్చయించెనఁట !"

బలవంత — ఏమేమీ? పురజను లందఱామెను దహింపఁజూచుచున్నారా ?

పథికుఁడు — విరాగిణియై యున్నయామెకు "సతి" యొనరించుటవలన గొప్ప పుణ్యమును గౌరవమును గలుగునని బోధించి వ్యాసనారాయణుని సోదరి యగుసుమతియు, మఱికొందఱు బ్రాహ్మణులును ఆమెను దేహత్యాగమున కొడం బఱచిరి.

బలవంత — ఆమె మనఃపూర్తిగా నందులకు సమ్మతించెనా ?

పథికుఁడు — సమ్మతించెనని వారందురుగాని నేను విశ్వసింపను.

బలవంత — తరువాత నేమైనది ?

పథికుఁడు — పిదపఁ బట్టణ మంతయు నలంకరింప మొదలిడిరి. రేపటియుదయమునఁ బదిగంటలకామె చితిపై నెక్కును.

బలవంత — అయ్యో ! మన భారతదేశ మెంత దౌర్భాగ్యస్థితికి వచ్చినది ! తురుష్కులు హైందవపితంతువులను జెఱుతురనిన చో విగతభర్తృకలకు వివాహము చేయవలయును

గాని భగవదిచ్ఛకు విరుద్ధముగ వారి నిట్లు మృత్యుదేవత
కర్పించుట యెంత క్రూరము !

శ్లో. "పరిత్యజే దర్థకామౌ స్యాతాం ధర్మవివర్జితౌ,
ధర్మం చాప్యసుఖోదర్కం లోకవిద్విష్టమేవచ."

అని మనుస్మృతియందుఁ జెప్పఁబడలేదా ? ధర్మవిరుద్ధములైన యర్థకామములను విడువవలయు ననియు, తుద కసుఖకరమును లోకమునకు ద్వేషకరమునైన ధర్మమునుసయితము విడువవలయు ననియు, మనశాస్త్రములు ఘోషింపుచుండ మనవారు తప్పుడుమార్గములఁబట్టి యాచారమో, ఆచారమోయని విలపించు చున్నారు. మిత్రమా ! నే నింకఁ బోవలయును. నీకింత శ్రమ యిచ్చినందులకు క్షమింపుము.

అని చెప్పి యాతనికడ సెలవు గొని వ్యాసనారాయణుని గృహామువంక కరిగెను. ఆతఁ డెంత ప్రయత్నించినను కళావతిని జూడఁజాలకపోయెను. విఫలమనోరథుఁడై యాతఁడు ఫెజిల్ఖానునొద్దకు వచ్చి జరగినసంగతి యంతయుఁ బూనగుచ్చిన ట్లాతనికి నివేదించెను. ఎన్ని కష్టముల నొందియైన నామెను రక్షింపవలయు నని యాతఁడు నిశ్చయించుకొనెను. ఆ రాత్రి యంతయుఁ గళావతీరక్షణమార్గములనే యాతఁడు వెదకు చుండెను. తుద కొకవిధమున నిశ్చయించుకొని తన యనుచరులకది నివేదించి కార్యనిర్వహణమునకుఁ గడంగెను.

పాపరహితయు, నవయౌవనకోమలాంగియు నగు నొక కాంతను పరలోకమున కంపఁదలంచు చుండిరే యనుకోపమున భూమి నంతయు భస్మముగఁ జేయువానివలె సూర్యభగవా

నుఁడు కషాయదీధితుల వెదఁజల్లుచుఁ బ్రాగ్దిశయం దుదయిం చెను. విద్యానగర మంతయు మంగళవాద్యములచే మాఱు మ్రోఁగిపోవు చుండెను. ఆనాఁడు తెల్లవాఱునప్పటికి దేవాలయమునందలి పూజ యంతయుఁ బూర్తి గావింపఁబడెను. అర్చకులు, పండితులు మున్నగు ప్రజ లందఱును వ్యాసనారాయణునిగృహమునకు వచ్చిరి. కళావతిని జలక మాడించి సర్వాభరణభూషితను గావించిరి. ఆమె కంధర మంతయుఁ బూలహారములచే నింపివైచిరి. అనేక విధములగు వాద్యములు వినవచ్చు చుండెను. బ్రాహ్మణులు వేదపారాయణము నారంభించిరి. అటుపిదప నూరేఁగింపుటుత్సవము ప్రారంభమాయెను. ఆయుత్సవము మహారాజుల వివాహాడంబరములను మించి యుండెను. ముందు మంగళవాద్యములును, అటుపిదప సర్వాభరణభూషితయగు కళావతియు, ఆమె వెనుకభాగమునఁ బౌరులును నడచుచుండిరి. ఇంత మహోత్సవము జరగుచున్న దని కళావతికిఁ దెలిసినటులు లేదు. వ్యాసనారాయణుఁ డేమార్గము నడపించునో యట్లామె నడచుచుండెను. (ఆమెను జూడ రావణునకు వెఱచి యగ్నిఁ జొరఁబడుచున్న వేదవతియో యను నటులుండెను.) ఆమె కదలుచున్న చలువరాతి బొమ్మయో యను నటు లుండెను. ఇట్లు పురమంతయుఁ గడచి వారు రుద్రభూమి కడకు వచ్చిరి.

అచటఁ బెద్దచితి యొకటి పేర్చి దానిపై గంధపుఁజెక్కలను కొన్నిటిని వైచిరి. అగ్ని దరికొల్పఁబడిన తోడనే మింటి నంటువిధమున జ్వాలలు చెలరేఁగ మొదలిడెను. బాహ్యదృష్టి శూన్యయై యున్నకళావతి కీమంటలు భయమును గల్పింపఁ

జాలకపోయెను. మోరోపం తామెవెనుకను నిలిచి, "నాకోర్కె నెఱవేర్పుము. నీ సౌందర్య మడవిఁ గాచినవెన్నెల గానీయకుము. సమ్మతించితివా యొక్క క్షణములో నిన్ను రక్షించెదను" అని యామెకు వినఁబడునట్లు మెల్లఁగాఁ జెప్పుచుండెను. కాని యామె యాతనిని లక్ష్యపెట్ట దయ్యెను. అగ్ని ప్రవేశ సమయ మాసన్న మాయెను. ఇంతలో నుత్తరపు దిశనుండి టకటక మనుగుఱ్ఱపు డెక్కలచప్పుడు వినన య్యెను. అందఱు నావంకకుఁ జూడఁజొచ్చిరి. పదునెనమండుగు రాశ్వికులు వారి యెదుటఁ బ్రత్యక్షమైరి. వారిరాకకుఁ గారణము తెలియక మహారాష్ట్రు లందఱును నిశ్చేష్టులై యుండిరి. ఇంతలో దక్షిణ దిక్కునుండి యిరువురుమహారాష్ట్రవీరు లశ్వారూఢులై వచ్చుచుండిరి. ఈసంరంభ కారణమంతయు బ్రాహ్మణులు గ్రహింపఁ జాలకపోయిరి గాని మహారాష్ట్రవీరులు తమపక్షమున నుందురనిమాత్ర మాద్విజశ్రేణి తలంపఁజొచ్చెను. ఇంతలో నాయిరువు రాశ్వికులును కళావతి కడకు వచ్చిరి. అం దొకఁడు గుఱ్ఱమునుండి దిగి కళావతిని రెండవవాని తురగముపైఁ గూర్చుండఁబెట్టెను. ఈ కార్యమును జూచినంతనే సమీపమున నున్న మోరోపం తాతనిగుఱ్ఱపుఁ గళ్లెమును బట్టుకొనెను. కాని మొదటియాశ్వికుఁ డాతనిశిరమును తనకరవాలమున కెరచేసెను. ఆ పాపాత్ముఁడు నేలఁ గూలినంతనే రెండవ యాశ్వికుఁడగు ఫెజిల్ ఖాను తన గుఱ్ఱమునదలించి చక్రరక్షకునితోఁగూడ వెడలిపోవఁజొచ్చెను. ఇది యంతయుఁ గొన్ని క్షణములలో జరగిపోయెను. కళావతి నొకఁడు గొనిపోవుచుండె నని తెలిసి యచటి బ్రాహ్మణులు ప్రజ్వలించుచున్న

కత్తులను దీసి వారివెంటఁ బరుగిడఁజొచ్చిరి గాని యశ్వా రూఢు లగువారిని బట్టఁజాలకపోయిరి. ఆశ్వికులు కొంతద వ్వేఁగినపిదపఁ గళావతికి స్మృతి వచ్చెను. అప్పుడు మహా రాష్ట్రవేషమున నున్న ఫేజిల్ ఖాను తా నామెను రక్షించితి ననియు మున్ముందామె యిచ్చకు వచ్చినట్లు చేయవచ్చు ననియుఁ దెలిపి యామె నూరడించెను. మహమ్మదీయసైని కులును తనయను చరులే యగుటచే నాతఁడుపరివారసహితుఁడై కళావతిని రక్షింపఁగలిగెను.

## నా ల్గ వ ప్ర క ర ణ ము.

### ప త క ము.

తులజాపురపు ముట్టడిలో వ్యాసశాస్త్రి యొకతురు ష్కునికలవాలాఘాతముచే నేలఁ బడెనని తెలిసికొంటిమిగదా! ఆతనికి శిరముపై నొక పెద్దగాయము తగిలెనేకాని ప్రాణా పాయము గలుగ లేదు. ఆతనిమిత్త్రుఁడగు చంద్రశేఖరుఁ డాతని నొక యేకాంతస్థలమునకుఁ గొనిపోయి రక్షించెను. రాధానందాబాయీలను రక్షించిన జానకీరాముఁడు రెండు మూఁడు దినములు ప్రయత్నించి వ్యాసశాస్త్రి యున్నస్థాన మును దెలిసికొనెను. వ్యాసశాస్త్రికిఁ బ్రయాణము చేయుటకుఁ దగినశక్తి వచ్చునప్పటికిఁ గళావతి విద్యానగరమున నున్నదని తెలియవచ్చెను. అందుచే నాతఁడు సకుటుంబముగ విద్యానగర మునకుఁ బయనించెను. ఫెజిల్ ఖానుచేఁ గళావతి రక్షింపఁబడిన నాటిఁసాయంకాలముననే వ్యాసశాస్త్రి భార్యలతోఁ గూడ

విద్యానగరమునకు వచ్చెను. మృత్యుముఖముననుండి కళావతి రక్షింపఁబడిన దనువార్త నాలించి యాతఁడెంతయు సంతసించెను గాని యామె మరల నేమియిక్కట్టులఁ బడుచుండెనో యనిమాత్ర మాతఁడు దిగు లొందుచుండెను. భార్యలను వ్యాసనారాయణునిగృహమున నుంచి కొమార్తెజాడ నరయుచుఁ దుదకుఁ జంపావతీపురముఁ జేరెను.

ఫెజిల్ఖాను కళావతిని రక్షించినపిదప ననుచరసహితుఁడై చంపావతీపురమున కరిగి యప్పుల్ఖానుమిత్రునియింట దిగెను. అప్పటికి జైనాలుర్లీలుకూడ నచ్చటికి వచ్చిరి. వారిరువురును కళావతిని మిక్కిలి గారవించి నిర్మలోదకమున జలకమాడించి భోజనార్థము సమీపమందున్న యొక బ్రాహ్మణగృహమునకుఁ బంపిరి. ఫెజిల్ఖాను తల్లియగు లుర్లీబీగము ననేకవిధముల నోదార్చి దుఃఖోపశాంతిఁ జేయుచుండెను. ఇట్లొకింత కాలము గడచినపిదప నామె యాతనిముం దొక మందసము నుంచి దానిని తెఱవు మనెను. అది తెఱచినంతనే యం దొక యాంజనేయపతకమును, ఒక కాగితమును గానిపించెను. ఆమెయాజ్ఞపై నాతఁ డా కాగితమును గొని చదువనం దిట్లు లిఖింపఁబడెను.

"నాకుమారునివలె నాకడఁ బెరుఁగుచున్న ఫెజిల్ఖా ననువాని కీపతకము చెందియున్నది. వానిచరిత్ర మగమ్యముగ నున్నది. నే నొకనాఁడు కార్యార్థ మరణ్యమార్గమునఁ బోవుచుంటిని. కార్యానంతరము గృహోన్ముఖుఁడనై వచ్చునపుడు నా కొకయాశ్వికుఁ డెదురాయెను. ఆతని రూపమును దుస్తులను జూడ నతఁడు దుర్మార్గుఁ డని గ్రహింపఁగలిగితిని.

'నీ వెవరు ? ఎచటికిఁ బోవుచుంటివి ?' అని యతనిని ప్రశ్నిం చితిని.అందుల కాతఁడు సరియగు జవాబు చెప్పలేదు. అతని కడ నొకబాలుఁడు బిగ్గరగా నేడ్చుచుండెను. ఈబాలుఁ డెవరని యతనిని ప్రశ్నించితిని. అందులకుఁగూడ నాతఁడు సరియగు ప్రత్యుత్తర మీయలేదు. వీని నన్నిటిని జూడ నతఁ డొక చోరుఁ డనియు బాలుని దొంగతనముగాఁ గొనివచ్చుచున్నాఁ డనియుఁ దెలిసెను. ఆబాలునిసంగతి యంతయు నెఱింగించినఁ గాని పోనీయ నని నే నాయాశ్వికుని కడ్డుదగిలితిని. నేను బీజ పురసేనాధిపతి నని యాతఁ డెఱింగియుండఁడు. అందుచే నే నొకసామాన్యపథికుఁడ నని యెంచి యాకస్మికముగాఁ గత్తి దూసి నాశిరమును గుఱి చూచి తనశక్తికొలఁది నొక [illegible]ు వేసెను. అది నేను గ్రహించి యపాయము రాకమునుపే నాగుఱ్ఱము నొక త్రుటిలోఁ బ్రక్క దాఁటించితిని. ఆదెబ్బ గుఱి తప్పెను గాని నాయశ్వమునకు బలమగు గాయము తగిలెను. అప్పుడు నావారువము నాయాశ్వికునిపై పౌటా పౌటిని దాఁటించితిని. ఆవేగమున కాచోరుని గుఱ్ఱము సైఁపఁ [illegible]లక చెంగున వెనుకకొక్కగంతు వైచెను. అమాంతముగాఁ గలిగిన యీచలనముచే బాలుఁడు తురగముననుండి జాఱి క్రిందఁ బడియెను. నే నాచోరుని బట్టవలయు నని యాతని నెదుర్కొంటిని. నన్ను జయించుట దుర్లభ మని యెఱింగి యాతఁడు తన యశ్వమును చటాలున మరల్చి పలాయితుఁ డాయెను. నే నాతనిని కొంతదనుక వెన్నాడితిని గాని, నా వారువమునకు బలమగు గాయము తగులుటచేతను, మిక్కిలి యలసి యుండుటచేతను నే నాతనిఁ బట్టుకొనఁజాలకపోతిని.

మరల నే నా బాలుఁ డున్న యెడకువచ్చి, వానిని నాగుఱ్ఱముపై నిడుకొని బీజపురమును జేరితిని. నేను రక్షించిన బాలుని మెడ యం దీమందసమున నున్న పతకము కట్టఁబడి యుండెను. పుత్త్రరహితుఁడ నగుటచే నాతనినిఁ జేరఁదీసి పెంచి ఫెజిల్ ఖానను నామకరణముఁ జేసితిని. ఆ బాలుని జననీజనకులను కనుఁగొన నెంత ప్రయత్నించినను దొరకలేదు. ఈపతకము నాతని తలిదండ్రులే యుంచి రని తోఁచుచున్నది. సాధ్యమైనచో దీనిసాహాయ్యమున నాతఁడే తన జననీజనకులను కనుఁగొనుఁగాక! అఫ్జల్ ఖాన్."

అఫ్జుల్ ఖాను తనజీవితకాలములో ఫెజిల్ ఖానుతలిదండ్రులను కనుఁగొనుటకై యెంతో ప్రయత్నించి విఫలమనోరథుఁ డాయె ననియు, అందుచే నాతఁడే తన జననీజనకులను కనుగొనవలయు ననియుఁ జెప్పి లుట్ఫీబీగము మరలఁ జింతాసాగరమున మునిఁగిపోయెను.

ఇంతలోఁ గళావతి నన్వేషించుచున్న వ్యాసశాస్త్రి యాగృహమునకు వచ్చి తలుపు దట్టెను. లుట్ఫీబీగము లోపలి కేఁగినపిదప ఫెజిల్ ఖాను తలుపు తెఱచి యాతనిని తనకడ నాసీనునిఁ గావించుకొనియెను. పుత్త్రికాభిక్ష వేఁడఁదలంచి వచ్చినవ్యాసశాస్త్రి బల్లపై నున్న బంగారు పతకమువంక నిశ్చేష్టుఁడై చూడఁ జొచ్చెను. పిదప నాపతక మెవ్వారి దని ప్రశ్నించెను. ఫెజిల్ ఖాను బాష్పపూరితలోచనుఁడై యఫ్జుల్ ఖాను వ్రాసినకాగితము నాతని కందిచ్చెను. వ్యాసశాస్త్రికి ఫెజిల్ ఖానునిజీవితరహస్య మంతయు నొక్క క్షణములోఁ దెలిసిపోయెను. "హా! శ్యామసుందరా!" యనియొక్క కేక వైచి

# నాల్గవ ప్రకర

యాతనినిఁ గౌఁగిలించుకొనెను. ఫెజిల్‌ఖానున కది యింతయు విచిత్రముగాఁ గానిపించుచుండెను. వ్యాసశాస్త్రి యాతనికి యథార్థస్థితి యంతయుఁ జెప్పివైచి, రెండుసారు లాతఁడు రక్షించిన కళావతి యాతనిభార్యయే యని తెలిపెను. ఒకవంక నఫ్ఝుల్‌ఖానుయొక్కయు, తనజననీ జనకులయొక్కయు మరణమునఁ గలిగినదుఃఖమును, రెండవవంక భార్యను రక్షింపఁ గలిగితిని గదా యనుసంతోషమును గలసి యాతనిమానసమును కలఁచివైచుచుండెను. అతఁడు తనప్రాణములకన్న మిన్నగాఁ దలంచి రక్షించినకాంత యతని జాయయే యగుట దైవఘటనము గదా !

కొలఁది దినములలోనే ఫెజిల్‌ఖాను ప్రాయశ్చిత్తాది విధులను గావించుకొని శ్యామసుందరుఁడను బ్రాహ్మణోత్తముఁడాయెను. జైనాలున్నీల నాతఁడెప్పటివలెఁ బ్రేమించుచుండెను. కళావతీ శ్యామసుందరులకుఁ బునస్సమాగమ పుణ్యకాలమున దైనాభోవాన్‌ఖానుల వివాహముగూడ నతివైభవముతో జరగెను.

సంపూర్ణము.

Printed at Ananda Press, Madras.

